శ్రీరస్తు.

# నీలాసుందరీపరిణయము

కూచిమంచి తిమ్మకవిప్రణీతము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1939

శ్రీ ర స్తు.

# నీలాసుందరీపరిణయము

## పీఠిక.

---

ఇష్టదేవతాదిప్రార్థనము.



లకుఁ దానకం బగుచుఁ
జెన్నలరారెడు వెండికొండపై
మేలికడానిడాల్ హొయలు
మీఱెడుజాబిలితాలమేడలో
వేలుపుఱేఁడు నల్వయును
వెన్నుఁడు గొల్వఁగ మంచుఁగొండరా
చూలిని గూడి వేడుకలఁ
జొక్కెడులేనెలతాల్పుఁ గొల్చెదన్. 1

సీ. అలరుపెంగడిమితోఁటల నాడుపూఁబోఁడి
పూపవెన్నెలతేనిఁ బూనుచాన
కోరి యేనుఁగుమోముఁగొడుకుఁ గాంచినతల్లి
చిలువతాలుపు వేల్పువలపుటింతి
తెలిబొబ్బమెకపుమేల్తేజి నెక్కెడిదంట
చెడుగురక్కసిమూఁకఁ జిదుముదిట్ట
తొలుపల్కుగిల్కుటం దెలుగలయొలనాఁగ
యెల్లమేట్టెంకియై యొసఁగుచామ

తే. యొనరఁ దెఱగంటితెఱవలయుడిగములకు
నడరి యుడివోనిబలుసిరులిడెడునట్టి
గట్టుదొరపట్టి యొనలేనికనికరమునఁ
బొదలుచును మమ్ము ననయంబుఁ బ్రోచుఁగాత. 2

సీ. కొఱమాలి విసమిడ్డకఱకురక్కసిఁ జెండి
పలుపుమీఁటెడుబండి విఱుగఁ ద్రొక్కి
వెఱఁగొప్ప ప్రేతల మొఱఁగి వెన్నలు మెక్కి
తఱి సూచి మద్దులు పెఱికివైచి
యఱచేతఁ గొండఁ జూపఱు వొగడఁగఁ బూని
నెరి గిబ్బతోలువేల్పు మురియడంచి
చిఱుతపాయపుగొల్లతెఱవల వలపించి
మఱవక పసులఁ బల్మఱును గాచి
తే. వెఱవెఱుంగక మడువున నుఱికి కడిమి
మెఱయఁ డక్కరివిసదారి బిఱుసుఁదఱిమి
మఱియుఁ బేరగుతులువల నుఱుము సేసి
వఱలుకఱివేల్పు నెదనెంతు గుఱిదలిర్ప. 3

ఉ. కమ్మనితెమ్మదెమ్మెరలు గ్రమ్మఁగ నిమ్మగుతమ్మిమేడలోఁ
దుమ్మెదకొమ్మ లెమ్మెలను దూకొని నీటుగఁ బాటఁ బాడఁ
గాఁ, గొమ్మని పూవుఁదేనియలఁ గూరిమి నామెత లిచ్చి నిచ్చ
లున్, నెమ్మది నుండుపాల్కడలినెయ్యపుఁగూఁతురు మమ్ముఁ
బ్రోచుతన్. 4

క. తద్దయుఁ బొగడెద వేల్పుఁ
బెద్ద యనన్ జగము లెల్లఁ బెంచుచుఁ బల్కున్

ముద్దియతో నెఱతామర
గద్దియఁ గొలువుండునల్లొగంబుల ప్రోడన్. 5

చ. బలుతెలిపుల్గువారువము బంగరువీణెయు మిన్కుటందెలుం
జిలుకతుటారిబోటియును జిందపువన్నియమేనుఁ బొత్తముం
జెలువపుఁదెల్లదమ్మివిరిసింగపుగద్దెయుఁ గల్గి యొప్పు న
వ్వలుకులచాన జానలరుపల్కులొసంగెడుఁగాత నిచ్చలున్.

ఉ. మ్రొక్కులొనర్తుఁ గెలుగవ మోడిచి చొక్కపుఁగొక్కు
జక్కిపై, నెక్కెడుబల్వజీరునకు నిమ్ముగ నమ్మినవారిమేల్ప
నుల్, చక్కఁగఁ జేయుదేవరకుఁ జక్కెర కొబ్బెరపండు
లుండ్రముల్, మెక్కెడుపాఁపజందెములమేటికి బత్తిని మాటి
మాటికిన్. 7

ఆ. పుట్టఁ బుట్టినట్టి గిట్టయు దీవిని
బొడమినట్టిపున్నెములగనియును
మొదలుగాఁగఁ గబ్బములు వేల్పుబాసను
గూర్చినట్టివారిఁ గోరి తలఁతు. 8

ఉ. మున్ను దెనుంగుఁగబ్బములు ముజ్జగముల్ వొగడంగఁ
గూర్చె, రెన్నికఁ గన్నబల్లిదుల నిమ్మగుడెందపుఁదమ్మిలోప
లం, బన్నుగ నిల్పి నిచ్చలును బాయక కూరిమితోఁ దలం
చెదఁ, నన్నయభట్టుఁ దిక్కనను నాచనసోముని నెట్టిపెగ్గ
డన్. 9

క. ఎదఁ గుదు రగుబత్తిని గొ
ల్చెదఁ బలుపుట్టువులఁ గూరిచినదోసంబుల్

చిదుమంగా వేడుకపె
ల్లిద మొదవెడు దెందులూరిలింగయగురునిన్. 10

ఆ. అనుచు నెల్లవేల్పులను గొల్చి మును కబ్బ
ములను గన్నగాళికులను దలఁచి
గురుని బత్తి నెంచి కోరి యచ్చతెనుంగుఁ
గబ్బమే నొనర్పఁ గడఁగుతఱిని. 11

కవిస్వప్నవృత్తాంతము.

సీ. ఏవేల్పు గుదెతాల్పుతీవంచమోముల
తులువల బలుక్రొవ్వు దొలఁగ మీఱె
నేసామి సామేన నేప్రొద్దు వలిగట్టు
దొరపట్టి నర్మిలితోడఁ బూనె
నేఱేఁడు పనిమీఱ నీరేడుజగములఁ
బ్రోడయై యనయంబుఁ బ్రోవ నోపె
నేరాయఁ డెపులేనిగారాపుటూడెంపు
జడదారులకు ముత్తి వడి నొసంగె
తే. మన్ను గేస్తుఁడు నగ్గియు మిన్ను నీరుఁ
బ్రొద్దు నెల గాడ్పు లెవ్వానిరూపులయ్యె
నట్టి తెలిగట్టుమన్కిపట్టైనదిట్ట
యొరపు రాణింపఁ గలలోన నొక్కనాఁడు. 12

సీ. పసిడిండిమెకపురక్కసితోలు మొలఁ జుట్టి
కేల ముమ్మొనవాలు గీలుకొలిపి
చిన్న వెన్నెలఱేని సికపువ్వుగాఁ బూని
పెనుచంక నొకజింకపిల్ల నిఱికి

జడలలోఁ జెలినీటిచదలేటిజాల్వాఁటి
జానొంద వెలిబూది మేన నలఁది
తోరంపుఁజిల్వరాతొడవు లిమ్ముగఁ దాల్చి
యెదఁ బున్కసరములు కుదురుపఱచి
తే. మోముఁదమ్మిని జిఱునవ్వు మొలకలెత్త
గుబ్బలులతేనిగారాపుఁగూఁతుతోడ
నుక్కుమిగిలినబలుగిబ్బజక్కినెక్కి
కొమరుదళుకొత్త మ్రోలఁ గన్గొనఁగనయ్యె. 13

క. అటువలెఁ గనఁబడి యెద మి
క్కుట మగునక్కటిక మొదవ గుబ్బలిదొరయి
ల్లటపల్లుఁడు ననుఁ గన్గొని
దిటముగ నపు డిట్టు లనుచుఁ దెలియం బలికెన్. 14

సీ. నీతండ్రి గంగన నిచ్చనిచ్చలు మమ్ముఁ
బూజించె నపరంజిపూలచేత
నీతల్లి లచ్చమ నే సంతసిలఁగ నో
ములు నోఁచెఁ బుడమివేల్పులకు నెల్ల
నీపినతండ్రు లెన్నికలు గాంచిరి జగ్గ
నయు సింగనయు నర్సనయును మిగిలి
నీతమ్ము లెలమి నొందించిరి మమ్ము సిం
గనయు సూరనయు జగ్గనయుఁ జెలఁగి
తే. నీయనుఁగురాణి బుచ్చమ నెలఁత లెల్ల
మేలనఁ దనర్చె గట్టురాచూలిఁ గొలిచి
మానికంబవు గద కూచిమంచికొలను
నం దరయఁ దిమ్మకవిరాయ యలర నీవు. 15

మ. మును కబ్బంబుల నెల్లఁ జెప్పి యెలమిం బొల్పొందుచున్
నాకు నప్పనముల్ చేసిన ప్రోడ వీవిపుడు గూర్పం బూను
నీయచ్చపుం, దెనుఁగుంగబ్బము నిమ్ము నిచ్చలపుబత్తిన్మత్తి
యున్ బత్తియున్, నెన రొప్ప న్నమకూర్చు చెప్పుడును నే
నీయొద్దనే యుండెదన్. 16

క. అని నుడువుచు నద్దేవర
కను మొఱఁగిన నపుడు మేలుకాంచి యెదను బా
యనివేడ్క లొదవ నతనికిఁ
బని యొనరఁగ మ్రొక్కు లొసఁగి బత్తి దలిర్పన్. 17

షష్ఠ్యంతములు.

క. లిబ్బులదొర చెలికానికి
గుబ్బలియొకిమీనియనుఁగుఁగూఁతుమగనికిన్
బెబ్బులిరేఁద్రిమ్మరితో
ల్పబ్బినతమిఁ గప్పుకొన్న బలువేల్పునకున్. 18

క. చుఱుకు గలయొక్కకోలను
గుటిగాఁ దిగ ప్రోల్లు నేలఁ గూలిచి కడిమిన్
మెఱయుచు జేజేగములకుఁ
దఱుఁగనిమే లిడినగిబ్బత త్తడినొఁకున్. 19

క. తలఁచునిరాబారులచి
క్కులు దొలఁగఁగఁజేసి మనుచు గొనములగనికిం
దులువతొలువేల్పుఁగూటువ
బలితపుఁబెన్గొగులుఁజాలుఁబయ్యకకుఁ దగన్. 20

క. నెలతాలఁ బోలునిద్దపుఁ
దెలిడాల్గలమేనిమేటిదేవర కెపుడుం

గొలిచినబంటులకోర్కులు
పొలుపొదవఁగఁ బిదుకు వేలుపున్మొదవునకున్. 21

క. పితరద్వార కేటత్రాటక
జతనంబునఁ దివియ మిగుల జడుపున నెదలో
వెత గుడుచుతపసిబిడ్డని
బ్రతికించి యసంబుగన్న బల్లిదున గొలిన్. 22

తే. అప్పనంబుగ నెలమితో నచ్చతెనుఁగు
బాసచే నిప్పు డేనొనర్పఁగఁ దొడఁగిన
నీల యనుపేరఁ దేజున నివ్వటిల్లు
నింతిపెండిలికత తెఱఁ గెట్టు లనిన. 23

---

# ప్రథమాశ్వాసము



## కథాప్రస్తావన.

క. మును నైమిశ మనునడవిని
మొనసి నిరాబారిసింగములు పెక్కుకతల్
వినుచుండి రోమహర్షణు
ననుఁగుంగొడుకునకు నిట్టు లనిరింపొదవన్. 24

క. జడదారిరాయ మాకుం
గడునెలమిగ లచ్చిమగనికత యొక్కటి యే
ర్పడఁ దెల్పు మనుచు వేఁడినఁ
దొడరి యతం డపుడు వారితో నిట్లనియెన్. 25

### మిథిలవర్ణనము.

తే. వినుఁడు బల్లిదులార మీవీను లలర
నిచ్చలంబుగఁ దెల్పెద దచ్చికడల
నెన్నఁదగి వన్నియలకెల్లనిక్క యగుచుఁ
బుడమిలోపల మిథిలనాఁ బ్రోలు వెలయు. 26

సీ. వెలలేనివలుఁదక్రొన్నెలఱాలమాడువు
ల్దట్టంపుఁదరఁగమొత్తములు గాఁగ
రంగుబంగరువు మెఱుంగుటరంగులు
నిద్దంపుటిసుకతిన్నియలు గాఁగఁ

గులుకుఁబాయపురాచతలిరాకుఁబోఁడులు
పగడంపుఁదీవజొంపములు గాఁగ
మేటిపల్గొమ్ముల మెకపురాతుటుములు
లలితంపుఁబఱపుగుబ్బలులు గాఁగ
తే. వన్నియలుమీఱి చెలువారువారువములు
కొమరుదళుకొత్తు బలుమానికములుగాఁగఁ
బొంకముగ నెల్లసిరులకుఁ డెంకి యగుచుఁ
బాలమున్నీటిపగిది నాప్రోలు దనరు. 27

ఉ. పున్నమచందురుం దెగడుపొంకపుమోములరాచకన్నియల్
గ్రొన్నెలఱాలమేలిపనిక్రొప్పపుమేడల నాటలాడ నా
యన్నులకుల్కు లేనగవు లచ్చుమవెన్నెలలంచుఁ ద్రిమ్మరున్
వెన్నెలపుల్గుమొత్తములు వేడుక నబ్బలువీట మాటికిన్. 28

చ. మినుకుఁగడానిబంగరుపుమేడలసోరణగండ్లవెంట రేల్
చనియెడిరిక్కమొత్తమును జక్కఁగఁ జూచి మెఱుంగుఁ
బోఁడు లి,చ్చను బిడికిళ్లఁ బట్టి యవి జాఱి చనం దమగోళ్లు
చుక్కలం,చును నెడ నిల్చి చే వదలి చూచుచు నుబ్బర
పోదు రందులన్. 29

చ. పగడపుఁగంబముల్ నిలిపి పన్నినముత్తెపుఁజప్పరంబులన్
నిగనిగలాడు కుందనపునిద్దపుగోడల నాఁడెమైనము
త్తిగరతనంపుజిల్గుఁబనితిన్నియలున్ బలుదమ్మికెంపుటా
జిగితలుపు ల్గడు న్మెఱయుఁ జెన్నుదలిర్పఁగఁ బ్రోల నెల్లెడన్.

తే. ఇగురుఁబోండ్ల కగడ్తలో నీఁదుచిలువ
చెలువ లిడుతమ్మికెంపులుఁ జెలఁగి కోట

కొమ్మలం దాడు తెఱగంటికొమ్మ లిడెడు
వేల్పుదొరమానికములు నవ్వీటఁ దనరు. 31

తే. ప్రోలిపల్గోటకొమ్మలఁ బులుఁగుటాలు
గఱికయని డాసి చెంతఁ జెక్కడపుసింగ
ములను గన్గొని నడుచక్కి బోవ వెఱచి
ప్రొద్దుతేజీలు బలువడిఁ బోవుఁ గడల. 32

క. పన్నుగ నందలియేనుఁగు
గున్నలపై మావటీంద్రు కోరిక లడరన్
మిన్నేటిపసిఁడితామర
క్రొన్ననలను వన్నెమీఱఁ గోయుదు రెపుడున్. 33

తే. పొడుపుమలనుండి పడమటికడలికరుగఁ
బవలునలుజాములునుబట్టుఁ దోవలసూడు
తత్తడుల కని మాటలో దచ్చికడలఁ
బఱచి క్రమ్మఱు నచటిబాబాతుటుములు. 34

క. నలు మొగములఁ దా నాలుగు
తొలుపలుకును సదువు టేమి దొడ్డని నలువం
బలికి కలచదువు లెల్లను
బలుకుదు రొక్కొక్కనోరఁ బాఱులు వీటన్. 35

చ. కలన నెదిర్చెనేనిఁ దిగకన్నుల వేలుపు నైన మార్కొనం
దలఁపుదు రెద్ది వేఁడిన నెదం గని మానక జన్నిగట్టుఁ బె
ద్దలకును బేదసాదులకుఁ దద్దయు నిత్తురు ప్రోల నెప్పుడుం
బొలుపు దలిర్ప రేవెలుఁగు ప్రొద్దుకొలంబుల రాచసింగముల్.

ఆ. తొలుదాల్పునను(గు తొమ్మిదిపాఁతఱల్
రొక్క మున్న దనుచు నిక్కఁగాని

లెక్క కెక్కు డైన రొక్కంబుఁ దఱుఁగని
కొలుచు గలదు ప్రోలికోమటులకు. 37

తరలము.—

మొలకుఁ దెల్లనిబట్ట లేకయు ముచ్చటం గలు ద్రావుచుం
బొలము దున్నఁగ నోడి నాఁగలి పూని త్రిమ్మరు నంచు ని
చ్చలును బల్కుచు నుందు రాకటిసామియన్నను దట్టపుం
గలుముల న్వెలుఁగొంది యచ్చటి కాఁపుఁబెద్దలు తద్దయున్.

చ. కులుకుమిటారిగుబ్బలును గ్రొమ్ముడులు న్బిగికొనులుం బిఱుం
దులుఁ గవలంగఁ జిల్కలను దోలు నెపంబున నెల్లు లెత్తి గా
జులు గలుగల్లనం జుఱుకుఁజూపులచేఁ దెరువర్ల డెందముల్
గలఁపుదు రందులం బొలముకాపరి కాఁపుఁదుటారికత్తియల్.

చ. పగడపుఁదీఁగలో తళుకుబంగరుబొమ్మలొ క్రొమ్మెఱుంగులో
తొగచెలితున్కలో మరునితూపులొ బల్రతనంపుఁదేటలో
సొగసులదీవులో యనుచుఁ జూపఱు లువ్విళులూర నందు
లం, బొగడికఁ జెంది యందములఁ బొల్తురు నీటుగ నాటచేడి
యల్. 40

—॥ ధర్మ్ముఁడనుజేని వర్ణనము. ॥—

క. అవ్వీ డేలు న్మేలని
దవ్వులదొర లెన్న మిగుల ధర్మ్ముఁడు దనతోఁ
జివ్వకు నెదురై నిలిచిన
మువ్వురు వేలుపుల నైన మొనసి కలంచున్. 41

సీ. వెడవింటిబలుదంటఁ బొడసూపఁగా నీక
తొలుదాలుపు నొక్కమూల కనిచి

తోలు మొగల్తుటుముల దూఁదియ ట్లవియించి
కలువలచెలికాని వెలి యొనర్చి
గాలిమేఁతరితేనిఁ గాలూనఁ గా నీక
కడలి నెల్లప్పుడు నడలఁజేసి
వెడఁదమోము మెకంబు నడవుల డాఁగించి
గట్టులయెకిమీనిఁ గడకుఁ ద్రోచి
తే. చక్కఁదనమున వాసిని జాగమునను
జిగిని మాటలలోఁతున మగతనమున
నిచ్చలంబునఁ గడలఁదా నెచ్చుగాంచి
పొగడికలఁ జెందునెపుడు నప్పుడమితేఁడు. 42

సీ. ఎనలేనిమగఁటిమి నెసఁగువాఁ డగుటకుఁ
బొంచుండి కోఁతిని ద్రుంచఁడేని
కోర్కులెల్లను సమకూర్చువాఁ డగుట కగా
రక చుప్పనాక మరల్పఁడేని
కనికరంబుల కెల్ల నునికిప ట్టగుటకుఁ
బొలదిండ్లఁ బొలియింపఁ దలఁపఁడేని
యుడివోనికలుముల నడరు చుండుటకుఁ గా
అడవుల దుంపలు గుడువఁడేని
తే. బంతితేరులపంటవలంతితేని
కొడుకు దొర యగు నతనికిఁ గడిమి నీగిఁ
గనికరంబున సిరి నంచుఁ గడఁగి పెద్ద
లెన్న నారాచజాబిలి చెన్నుమీఱు. 43

క. పిఱికితనంబును జలమును
గొఱకొఱ యీలేనిగొనము గుఱి దప్పటయుం

దుఱుతును బిగియును గల్లయు
నెఱుఁగఁ డతం డించుకయిన నెల్లెడలందున్. 44

సీ. జగడంపుటో రెంపుజడదారికడ కేఁగి
చదలేటి తెలినీట జలకమాడి
తెఱగంటిదొరయింటి తెలిమ్రాఁకు లెగఁబ్రాఁకి
వలనొప్పఁ దెలిదీవి కెలనమెలఁగి
పలుచందములఁ జిందములఁ గ్రిందుపడఁజేసి
నెలతాల్పుబలువేల్పుచెలువు నవ్వి
చలమాని యలయేనుఁగులసూడు దిగనాడి
మగఱాలజిగి నేలఁ దగుచుఁ దెగడి

తే. ముత్తియంబుల నురువుల మొల్లవిరుల
మంచుసోనలఁ జొక్కుల నంచగముల
నెంచి కొంచక తనయసం బెల్లకడల
వెలుఁగ వెలుఁగొందు నారాచవేల్పుతేఁడు. 45

క. వెంగలియుఁ బిఱికివాఁడును
దొంగయుఁ గొండీఁడుఁ బేద తులువయు ననికిఁ
లొంగినవాఁడును లేఁ డర
యంగా మందునకు నైన నద్దొరపుడమిన్. 46

కుంభకుఁ డనుగొల్ల దొరకత.

క. ఆరామానిక మెప్పుడు
గారవమునఁ బెనుప నందుఁ గదలనిసిరులం
గేరుచుఁ గుంభకుఁ డనియెడి
పేరిటిగొల్లదొర యొకఁడు పేర్మిఁ జెలంగున్. 47

తే. వేలుపులఱేఁడు దన కొకవెల్ల మొదవె
కల దనుచు నిక్క నింతియకాని యిట్లు
కలవె పలువన్నియలగిడ్డికదుపు లంచు
నెంచుచుండు నతం డెందుఁ గొంచులేక. 48

సీ. అడిగినఁ గొదుకక పుడమివేల్పులకు ని
చ్చలుఁ బాడిమొదవులఁ జాల నొసఁగుఁ
బేదగేస్తులఁ జేరఁ బిల్చి కోరినయన్ని
దుక్కిటెద్దులఁ బల్మితోడ నిచ్చు
ముదుసళ్లఁ గడఁకమై వెదకి తా రావించి
నెమ్మిఁ గన్గొని యోగిరమ్ము వెట్టు
నెడపక గీమున కేతెంచువిందుల
కెలమి ఎల్వాలును సొమ్ములు నొసంగుఁ
తే. జెలిమికాండ్రను బెద్దలఁ గొలమువారిఁ
గూరిమి దలిర్ప సారెకు గారవించు
నార యరు దగుఁ బుడమిపై నరసి చూడ
గొల్లయెకిమీనినాఁడెంపుగొనములెల్ల. 49

తే. చుక్కలను వానచినుకుల నిక్కువముగ
లెక్కయిడవచ్చుఁగాని పెంపెక్క యెపుడుఁ
బుడమి యీనినతెఱఁగున నడరునతని
తొడుకులం దెల్లమిగ లెక్కయిడఁగరాదు. 50

క. అమ్మేటిగేస్తునకుఁ గడు
నెమ్మి యొనర్చుచును నిచ్చనిచ్చలు బలుపు
న్సొమ్ముల ధర్మద యనియెడు
కొమ్మ దనరు నెల్ల మేలిగొనములప్రోవై. 51

సీ. అనయమ్ముఁ బెఱయిమ్ములను ద్రిమ్మరుచునుండు
చలివెలుఁగుననుంగుఁజెలియ లెనయొ?
పెనుఱాఁగయై మ్రోఁగుచును మోసలకునేఁగు
నలుమొగంబులవేల్పుచెలువ దొరయొ?
జగమడ్డఁ దగుదొడ్డ సత్తియై బెదరించు
గట్టులయొకిమీానిపట్టి జతయొ?
పలుతేఁడులకు సూడు బలియించి పొలియించి
లలిఁ గేరుపంటవలంతి సరియొ?
తే. యివ్వెలందుక కని తనయీడుచేడె
లందఱును డెందములనుబ్బి యాడుకొనఁగఁ
జెలఁగి నాఁడెపుఁ బుడమి జేజేలగములఁ
బ్రోదిసేయుచు నెపుడు నప్పొలఁతి యలరు. 52

క. ఉడివోనిసిరుల నిటువలెఁ
దడవెడునయ్యాల్లగళ్లఁ దనియింతురు సొం
పడర సిరిదాముఁ డనునొక
కొడుకును మఱి నీల యనెడుకూఁతు రొకర్తున్. 53

## నీ లా వ ర్ణ న ము.

క. అచ్చిన్నికన్నెసోయగ
మచ్చెలువుం జిల్వచెల్వలందును మఱి య
య్యచ్చరచేడియలందును
నిచ్చలుఁ బరికింపఁ గలుగ నేర దొకప్డున్. 54

క. చన్నులు జక్కవగిబ్బలు
కన్నులు చెన్నలరునల్లకలువలు పిఱుఁదుల్

దిన్నెలు వన్నెలగని య
య్యన్నులతలమానికంబు నలరిరొ పొగడన్. 55

సీ. గొనబారునూగారు కొదనుతుమ్మెదబారు
బలుగబ్బపాలిండ్లు పసిఁడిగిండ్లు
ననుఁ గావిజిగిమోవి నవతేనియలబావి
దొరమించుమైరంగు తొమ్మెలుంగు
నాఁడెంపుజడపెంపు నాఁచుతీవలగుంపు
కలికికన్గవడాలు గండుమీలు
పొగడొందుమొగమెందుఁ దొగలగాదిలివిందు
జిగిలేఁగవునుఁదీవ మొగులుత్రోవ

తే. తఱులు తరఁగలు చేతులు తమ్మివిరులు
తొడ లనంటులు పిక్కలు దొనలు తళుకుఁ
జెక్కుటద్దంబు లడుగులు చెంగలువలు
బొమలు సింగిణు లమ్మించుఁబోఁడి కరయ. 56

ఉ. చిందమునందముం దఱుముఁ జేడియకుత్తుక క్రొత్తక ప్రపుం
గందముచందముం దెగడుఁ గన్నియనెమ్మెయితావిపిండు లేఁ
జెందొవవిందువన్నియ నిసీ యనుఁ బైదలినెన్నొసల్ బళీ!
కుందన మెందుఁను దొరయెకొమ్మనిగారపుమేనిచాయకున్?

క. నెలఁతుక చిఱునగవులు వె
న్నెలలం గన నవ్వు లేమ నిద్దపుఁగులుకుం
బలుకులు చిలుకల నులుకఁగఁ
బలుకుం బలుకుదురు వోలు బలుమగఱాలన్. 58

తే. అట్లు లేజవ్వనమ్ము సోయగముఁ గల్గి
చెన్నుమీఱుచు నున్నయయ్యన్నుమిన్నఁ

గాంచి తలిదండ్రు లెంతయు గారవమున
నుల్లమున నుబ్బుచున్నచో నొక్కనాఁడు. 59

కుంభకునిపాలి కొకబ్రాహ్మణుఁడు వచ్చుట.

సీ. తిగరేక లేర్పడ దిద్దిననొసలిను
న్వొలిబూదిబొట్టురంగులు సెలంగ
సరవిఁ జిచ్చఱకంటిదొరకంటి పేరింటి
పేరులు పేరెదఁ బెంపుమీఱ
మొలఁ బింజె వట్టి చెంగులు మాటి కట్టిన
వలిపనీర్కావిదోవతి సెలంగఁ
బైఁ గప్పుకొన్న హొంబట్టుదుప్పటి మెఱుం
గులు నల్గడలఁ గ్రమ్ముకొని వెలుంగఁ
తే. బొత్తములు మేల్కుళాయిపల్ ముత్తియంపుఁ
బోగులునుజాలజన్నిదంబులును గొడుగు
గిండి చెంబును గల్గి ముంగిటికి వచ్చి
నిలిచె వడినొక్కనాఁడెంపు నేల వేల్పు. 60

చ. నిలిచినఁ జూచి గొల్లదొర నిండినబత్తిని గేలు మోడ్చి య
బ్బలియుఁ డొసంగుదీవనలఁ బల్మఱుఁ గైకొని గొప్పతమ్మికెం
పులు గదియించినట్టిజిగిపుత్తడిముక్కలిపీఁటమీఁద ని
చ్చలముగ నుంచి పూజ లిడి చయ్యన నాతనితోడ నిట్లనున్.

తే. పుడమిదయ్యమ! యెందుండి వెడలి వచ్చి
తిటకు రాఁగర్జ మేమి మా కెఱుఁగఁ జేయు
మెచ్చుమిముబోఁటిపెద్దలు వచ్చు టెల్లఁ
దోడుతోడనె మేలు చేకూడఁ గాదె? 62

తే. అనుడు నగ్గొల్ల తేనిఁ గన్గొని కరంబు
సంతసంబున నలరి యజ్జన్ని గట్టుఁ
గొలముతలమానికము తనవలఁతితనము
గనఁబడఁగ నిట్టులని చెప్పఁగాఁ దొడంగె. 63

బ్రాహ్మణుఁడు కృష్ణునిలీలం దెల్పుట.

క. విను నీకు బావ యగునం
దునిచెంగటనుండి యెమ్మెతో నీకడకుం
జను దెంచితి నబ్బల్లిదుఁ
డనుపఁగ మీసేమ మెల్ల నారయుకొఱకున్. 64

క. కడు నిడుమలఁ బడి వారి
ప్పుడు మునుపటినెలవు వదలి పోఁకు మిగులఁగం
దొడుకులకు బృంద యనియెడు
నడవికిఁ గాఁపురము వచ్చి రలజడి మీఱన్. 65

క. మిగులఁ గడగండ్లఁ బడియుం
దెగకయు వారెల్ల నిపుడు నీమేనల్లుం
డగుకతివేలుపుకతమున
నొగి నుసులులతోడి నిల్చి యున్నారు సుమీ. 66

తే. అతఁడు గావించుకర్జంబు లరయ నొక్క
మోము గలిగినమానిసి యేమి దెలుపు
మీఱఁగా నాలుగై దాఱు నూఱుపదులు
నోళ్లు గలవారికిని బూని నుడువరాదు. 67

క. విను సిరిమంతుఁడు కడుప్రేఁ
గున నడరెడు పుడమిపడఁతికొఱకును జేజేల్

మును వేఁడుకొనిన మానిసి
తనము గనినవెన్నుఁ డతఁ డెదం బరికింపన్. 68

క. ఆచంద మెల్ల దిటముగ
నీచెవులకుఁ దనివి దీఱ నే నెఱిఁగింతుఁగా
రాచపను లిపుడె తలఁపం
జూచుకొనక యాలకింపు ప్రుక్కని తెలివిన్. 69

సీ. మును సోఁకుమూఁకల మోవ నోపక నేల
చేడియ దలఁకి జేజేలఁ గూడి
చదువులవేలుపు మొదలు వెన్నుని చెంత
కరిగి చాఁగిలి మ్రొక్కి సరగ లేచి
యాయన కత్తెఱం గంతయు నెఱిఁగించి
జియ్య యిప్పని జాగు సేయఁ బోక
కావింపవే యని కడు వేఁడుకొనిన న
వ్వేల్పుల కవ్వేల్పు వెరపుదీఱ

తే. నిప్పని యొనర్తుఁ బొందు మీరిండ్ల కనుచు
ననిచె ననిచిన కూర్మితో నపుడు తొగల
యనుఁగుకొలమున వసుదేవుఁ డనెడుదొరకుఁ
గొమరుఁడై పుట్టె నెంతయుఁ గొమరుమిగుల. 70

ఆ. పుట్టి కంసుఁ డనెడునట్టిరాకాసుల
తేనివలన సూడు తోనె పూని
నందునింటఁ జేరి నందునియిల్లుటా
లగుయశోద పాపఁ డనుచుఁ బెనుప. 71

తే. అత్తెఱంగునఁ బెనుచుచున్నంత నొక్క
మొదను బూతనయనుపేర నదరుపెరసు

నల్లఁద్రావుడుఁబడఁతి మత్తిల్లి చేరి
విసపుఁబాలిడఁ గని దాని యుసురుఁగొనియె. 72

ఆ. దండఁ గొండపోల్కి నుండునో నొండెడ
దండితనము మీఱ నండగొనక
పిండిపిండిగాఁగ రెండుకాళులఁ దాచి
దండి బండిపాలసుదిండిఁ జెండె. 73

క. దోరఁకొని తనుఁ బొదివి కడుఁ
సరగను జదలికిని నొగిని జను బేరజపుం
గరువలిబలుతోలు జేజే
నరుదుగ గుదెతాల్పువీఁటి కనిచెం గడిమిన్. 74

సీ. బుడుతకల్వలవిందుఁ బోలునెన్నొసలిపై
జెలువంపురారేక చిందులాడ
మొలఁ బట్టుదిండుపైఁ జెలువొందుగంటల
బంగారుమొలత్రాడు రంగు లీన
నెదఁ గ్రొత్తపులిగోరు లొదవినపతకంబు
బలుము త్తియపుసరంబులును బొదలఁ
జేతుల రతనంపుజిలుఁగుటుంగరములు
మురువులు నెనలేని మురువు సూప
తే. మెట్టదమ్ములనందియల్ బిట్టుమొరయ
దిట్టతనమునఁ జెలరేఁగి పట్టపగలె
నెట్టుకొని యెల్లవ్రేతల నట్టులందు
గుట్టు లరయుచు మెలఁగు నప్పట్టి మఱియు. 75

సీ. తలిరుఁబాయపుముద్దుఁజెలువలఁ గనుగీఁటి
వలరాచపనులకు వలసి పిలుచుఁ

జల్ల లమ్మఁగఁ బోవు గొల్లకొమ్మల నడ్డు
కొని సిగ్గు లెడలించి యెనసి కేరు
మగలతో నిదురించు మగువల మఱపించి
మగచెయ్వు లొనరింప మదిఁ దలంచు
నారాటమునఁ బొంగి నీరాట రేవులఁ
గాంచి కన్నెల బల్మిఁ గవయఁ జూచుఁ

తే. జిన్నపాపలఁ గూడి బల్లున్న రకల
నన్నిగిముల సన్నకసన్నఁ దూఱి
యున్న మీఁగడ పెరుఁగుపాల్వెన్న జున్ను
లన్నియును గొల్లనాడు నవ్వెన్నెలాఁడు. 76

సీ. పెనుమిన్కుఁగొనత్రోవలను మెలంగెడుతేఁడు
చెలఁగి ప్రేతలయిండ్ల మోఁగుచుండుఁ
గోరి నిరాబారు [illegible] కనలేని
బలియుండు గొల్లలఁ బాయకుండుఁ
గడఁగి జన్నపుఁదిండ్లు దోడరఁ ద్రిమ్మరుప్రోడ
కుట్టిలగమితోడఁ గూడి యాడుఁ
గలిమిపూఁబోడితోఁ గ[illegible]సి కేరెడుమేటి
గొల్లకన్నియలతోఁ గూడి కేరు

తే. లెక్కలిడరానిరాయంచ జక్క[illegible]
గ్రుడ్డుఁబనఁటులు [illegible] గొప్పబొజ్జఁ
బూను పెనుదంట ప్రే[illegible]లోనఁ గల్గు
జున్ను పెరుఁగులు మ్రుచ్చిలి జుర్రుచుండు. 77

వ. అంత. 78

క. బిట్టలిగి ప్రేత లోగిఁ దన
రట్టడిచందములఁ దెల్పి రాయిడి వెట్టం
గట్టలుకఁ దల్లి ఱోలం
గట్టిన వడి నేఁగి మద్దికవ పెకలించెన్. 79

ఆ. అట్టియావడులకు బిట్టు గాసిలి గొల్ల
లెల్ల బృందలోని కిపుడు సేరి
రందు విసపుమ్రాఁకు లై యున్న చెడుగు రే
ద్రిమ్మరుల నడంచి తమ్మికంటి. 80

సీ. బంగారుఁదగటుదుప్పటి బిగ్గ మొలఁ జుట్టి
కేలఁ జొక్కపుఁబిల్లఁగ్రోలు వట్టి
పెంపారుబలునెమ్మిపించె మౌదలఁ బూని
చెవిని జీఁకటిమ్రానిచివురు దుఱిమి
సొగసుగా నొసలఁ గస్తురిబొట్టు సవరించి
క్రొన్ననసరము లక్కున నమర్చి
గురివెందపూసపేరొరయ సందిటఁ గట్టి
సన్నంపుసెలగోల చంక నిఱికి
తే. చెలిమికాండ్రను గూడి నిచ్చలముమీఱఁ
గడఁకతోనాలకదుపులఁ గాచుకొనుచు
గొమరు దళుకొత్త ననయంబు జమునపొంత
మెలఁగు నెనలేనిహొయల నమ్మేఁటివేల్పు. 81

తే. మరుని రేఱేని జేజేలదొరకొమరునిఁ
బూపనెలతాల్పుచెలిపట్టిఁ బోలఁ జాలు
వానిచెలువంబు నుడువుల తేనికైనఁ
బూని దిటముగ వాక్రువ్వఁ బోలదెందు. 82

సీ. తెలిదమ్మితేకులఁ దెగడుకన్నులవాఁడు
తొగలనెచ్చెలి నేలు మొగమువాఁడు
మించునందముమించు మెఱుఁగుఁజెక్కులవాఁడు
కొదమతేఁటుల గేరుకురులవాఁడు
మెట్టదమ్ములపొల్చు మెట్టుమెట్టలవాఁడు
తరఁగచాలు నదల్చుతఱులవాఁడు
వలుఁద చిందము నెగ్గు పలుకుకుత్తుకవాఁడు
జడలమెకంబుఁ బోల్నడుమువాఁడు
తే. మొల్లమొగ్గలనెనయుపల్మొనలవాఁడు
పొదలుచిగురాకుదొరయు కెంబెదవివాఁడు
తొలుమొగుల్వోఁగ తరుముమైచెలువువాఁడు
చెన్నుగలవాఁడు పలతేనిఁగన్నవాఁడు. 83

కుంభకునికనుసన్నచే నీల బ్రాహ్మణునకు మ్రొక్కుట.

క. అని యిత్తెఱఁగునఁ బాలుఁడు
వినిపించిన గొల్లతేఁడు వేడ్కలు మదిలో
ననలెత్తఁగఁ దనమ్రోలం
గనుపట్టు ననుంగుఁబట్టిఁ గనుఁగొల్పుటయున్. 84

సీ. కొదమతుమ్మెదదిమ్ము నదలించుముంగురు
ల్బొసలిపై ముసరి తుంపెసలు గాయ
జిలుఁగుఁబయ్యెదలోనఁ దులకించుకోడెచ
న్బొగడలు డాఁగురుమూఁత లాడ
గొప్పపిఱుందుప్రేఁగునఁ దడఁబడునడల్
గుడుగుడుగుంచ మింపడర నాడ

మురిపంపునగవులు ముద్దులేఁజెక్కులఁ
బొదలుచు వెన్నెలప్రోవు లాడ
తే. గొనములకునెల్ల నాటపట్టనఁగఁజాలి
జాలువాబొమ్మపోల్కి నన్నెలవేల్పు
జింకతాలుప్పుచెంగటఁ జేరి యడుగుఁ
దమ్ములకు మ్రొక్కులిడియున్న కొమ్మఁ జూచి. 85

క. పలుతెఱఁగుల దీవనలిడి
వలనుగ నత్తమ్మిచూలివంగడపుంజా
బిలి యలతేనిం గని యి
చ్చెలి యెవ్వరిపడుచు తెలియఁ జెప్పుము దీనిన్. 86

నీలకుఁ దగినవరునిగుఱించి
బ్రాహ్మణుఁడును గుంభకుఁడును మాటలాడుట.

క. అరచేతివ్రాలు చూచిన
దొర యెందును లేనిదొడ్డదొరఁ జేకొని బల్
సిరుల నిరవందఁగల దీ
విరిఁబోఁడి జగంబులెల్ల విరివిగఁ బొగడన్. 87

తే. గొప్పకన్నులు నిడువాలుఁగురులుఁ జెలఁగు
కౌనుఁ గెంజాయ నలరుకేల్గవయు నడుగు
లును మొనల్గలపలుచాలుపును దనర్చెఁ
గన్నియలమిన్న కివియె మేల్చన్నె వన్నె. 88

చ. అనుటయు బాఁపనయ్య కతఁ డర్మిలి నిట్లని పల్కె దేవరా!
విను మిది నాడుపట్టి కడువేడుక నెప్పుడు నీల యంచు నీ
గొనముల ప్రోకఁ బిల్తు మిదిగో నిపు డీననఁబోఁడి కందమా

పెనిమిటిఁ గూర్చి సొంపలరఁ బెండ్లి యొనర్చు మదిం దలంచెదన్. 89

క. ఈకన్నియకుం దగునొక
రాకొమరుని నరసి నిబ్బరంబుగ నిపుడే
మా కెఱిఁగింపుఁడు తెలియ
నీ కుం గనరాని దొకటి నేలం గలదే? 90

క. నందుఁడు మాకుఁ గాదిలి
బందుగుఁ డాతనికి నొజ్జ బాఁపఁడ వగుటన్
డెందమునకు నీపలుకులు
పొందుగఁ బ్రాఁబల్కునుడువుపోలిక సుమ్మీ. 91

చ. కొలమును గల్మి తాల్మియును గూర్మియుఁ దెంపును జవ్వనంబునుం, జెలువము విద్దెయుఁ గొనముఁ జేవయుఁ బ్రోడతనంబుఁ దెల్వియుం, గలిగినపిన్న వానికిఁ గన్నె నిడం దగునంచుఁ దీర్పరు, ల్వాలుకుదు రట్లు గావున వలంతికి నీ కిఁకఁ జెప్ప నేటికిన్? 92

తే. అనిన నతఁ డాతనికి నిట్టులనుచుఁ బలికె
వినుము నాయఁడ ! నామాట వీనులలరఁ
జేర్మి నీకన్నియకుఁ దగు పెండ్లికొడుకు
వెన్న తెక్కలికాఁ డైన వేల్పు సుమ్ము. 93

క. వానికి నెనయగువాఁ డెం
దైన న్మఱి కలఁడె పుడమి నటుగాకయు నీ
మేనల్లుం డతనికి ని
చ్చానం బెండిలి యొనర్పఁ జను నరయంగన్. 94

మ. వెడఁగుంజాడలఁబోక నాపలుకు నీవీన్గోయి కింపైనఁ దెం
పడరన్వెన్నునికిమ్ము కన్నియను నెయ్యంబొప్ప నీవొప్పుగా
నుడువుల్వేయు నిఁకేల డెందమునఁ గన్గొమ్మెన్న నీకిప్పుడా
సుడివాల్గాలుపుకన్న వేఱు కలరే చుట్టంబు లేవంకలన్? 95

క. కావునఁ గొదుకక కఱిమై
దేవర కీకన్నె నిమ్ము తిరమగుమడితో
నావుడు నాతం డట్టుల
కావించెదఁ జుమ్ము వేడ్క గడలుకొనంగన్. 96

తే. నేలవేలుప! నందునిప్రోలి కరిగి
యన్ని తెఱఁగుల నతనికి వెన్నునికిని
గన్నెలాగెల్ల నెఱిఁగించి కర్జ మీవు
నేర్పు మెఱయంగ వడి సమకూర్పవయ్య. 97

క. నీకుం జెప్పెడిదే మిఁక
నీకర్జపుప్రేఁగుఁ బూని యేఁగుము మఱి మీ
రేకద మముఁబోఁటులకుం
గైకొని మేల్పనులు గూర్పఁగాఁ దగువారల్. 98

తే. అనుచుఁ బెనుమానికములు దాపినవెడంద
పతకమును దావళంబును బసిఁడియుంగ
రములుఁ బ్రోఁగులుఁ బట్టుఁబుట్టములు మొదలు
గలుగుతొడవులు గడునుడుగర లొసంగి. 99

చ. పనిచినఁ దద్దయుం బొదలి పాఱెడువేడ్కలవెల్లిఁ బెల్లుగా
మునుఁగుచు నేలవేల్పుతల ముందరిపల్లియ కేఁగె గొల్ల

డుఁ, గొనకొని ముద్దుఁగన్నియకుఁ గోరినయట్టిమగండు
గల్గెనంచును దనయాలుఁ దాను నెదఁ జొక్కుచు సోలుచు
నుండె నెంతయున్. 100

నీల కృష్ణునియందు వలపుఁగొని తనలోఁ దలపోసికొనుట.

తే. అంత నీలయుఁ దనతండ్రి చెంత మిగుల
సంతసంబునఁ బంటవలంతి వేల్పు
దొంతపగ నన్న కఱివేల్పువింతలెల్ల
మంతనంబునఁ దలఁచుచున్నంతఁ బొగిలి. 101

ఉ. ఎన్నఁడు సూతు ముజ్జగములేలెడు వేలుపుమోముఁదమ్మినిం
కెన్నఁడు విందు పీనుఁగవ కింపుగ వెన్నునిముద్దుఁబల్కులా
వన్నెలప్రోకయాదలను వావిరిఁ బత్తెలిముత్తియంపుఁబ్రా
లెన్నఁడు నింతు నింతులపుడెంతయు నెమ్మిని సంతసిల్లఁగన్.

సీ. వెన్నునిచిఱునవ్వువెన్నెలల్ పర్వక
వలపుఁబెంజీఁకటుల్ దొలఁగఁగలవె?
గుడుసుఁగైదువుజోదు సుడివాన గురియక
కడువిరాలపుటగ్గి యడఁగఁ గలదె?
కఱివేల్పుచూడ్కిజక్కర లుబ్బి పాఱక
బలుగ్రచ్చుఁబైరులు పండఁగలవె?
మలతాల్పుమెయిచాయమబ్బులు గ్రమ్మక
యెదకాఁకపెన్నెండ వదలఁగలదె?
తే. సోఁకుమూఁకలగొంగ మెచ్చుగనుదాళి
బొట్టుమూసికతోఁగూర్చి పొసఁగ నలుతఁ

ద్రాడు గట్టక సొగసెల్ల దఱిమి యొడల
వ్రేలువలరాచబలుబూచి వీడఁగలదె? 103

క. తొలునోములు మే లిప్పుడు
వలనుగఁ జేకూడవలదె వన్నెలగని నై
యలరెడువలమురితాలుపు
చెలిమి వెసం గలిగి యెల్ల చెలులుం బొగడన్. 104

సీ. పులుఁగుడాల్వేల్పు కెందలిరువాతెఱతేని
యలు గ్రోల నెన్నఁడు గలుగునొక్కొ!
తమ్మిపొక్కిటిమేటిఱొమ్మునఁ గులుకుగు
బ్బలు చేర్ప నెన్నఁడు గలుగునొక్కొ!
చుట్టుఁగైదువుజోదు మెట్టదమ్ములఁ గేలుఁ
గవనొత్త నెన్నఁడు గలుగునొక్కొ!
చిలువపానుపువానితళుకుఁజెక్కులముద్దు
గైకొన నెన్నఁడు గలుగునొక్కొ!
తే. వలపు గులుకంగఁ బసిఁడిదువ్వలువతాల్పు
మేన గొజ్జెఁగపూనీటిమెఱపుటింపుఁ
గప్పురంబు జవాదియుఁ గలిపి యిడ్డ
కలప మలఁదఁగ నెన్నఁడు గలుగునొక్కొ 105

ఉ. వెన్నునిచెంత నప్పుడమివేలుపుమానిక మేమి దెల్పునో
చెన్నుగ నన్నియుం దెలిసి చెల్వుఁడు దా నెటుగాఁ దలంచునో, క్రొన్నెలతాల్పుముద్దియను గూర్చి యొనర్చిననోము లిప్పు డే, వన్నెను బండునో నలువవ్రాఁత తెఱం గిఁక నెట్టు లుండునో. 106

క. చెలువమును జవ్వనంబును
జెలిమియు నెఱజాణతనము సింగారంబుం
దలఁపున మెలఁగెడుగోనమును
గలమగఁ డెనలేనితోడవు గద తొయ్యలికిన్. 107

చ. ఎడపక రేయియుం బగలు నెమ్మెల నమ్మలతాల్పుఁ గూడి పూ
వడిదపుజోదునిబ్బరపుటాలమునం దమి హెచ్చ వొచ్చె మె
య్యేడలను లేనిబల్హాయలు నిమ్ముగఁ గోరుచుఁ జాలఁ బ్రోడలై
యడరెడుగొల్లకన్నె లహహా తొలుబాముల నేమినోఁచిరో.

సీ. తెలిదమ్మికంటివాతెఱ యాన ముం దెంత
పెనువంతఁ గుందెనో పిల్లఁగ్రోవి
రక్కసిగొంగపే రక్కున వ్రాలునం
దుల కేమి నోఁచెనో తొలసిపేరు
సిరితేనినిద్దంపుఁజెక్కు లబ్బఁగ నెంత
గొలిచెనో మును గొండగోఁగుఁబువ్వ
లాలకాపరిమేన నలరంగ నేమేలు
సలిపెనో హొంబట్టుసన్నసాలు
తే. దుక్కివాల్దాల్పుననుఁగునై దోడుమ్రోలఁ
దొడరి యనయంబు నాడంగఁబడసినట్టి
పురిపులుఁగుమొత్త మెనలేనిపున్నియంబు
లేమిచేసెనో సెగకంటిసామిఁ గూర్చి. 109

చ. దిట మగుచెల్వముఁ గోనముఁ దేజును గల్గినముద్దుగుమ్మకుం
దటుకున నొక్కపాలసునిఁ దారిచి బిగ్గర నంటఁ గట్టి చొ
క్కట మగునేపువాని కొకగ్రద్దఱిజాడలచేడెఁ గూరుచుం
గటకట తమ్మిచూలికొఱగాములు బాములుగాఁ దలంచెదన్.

సీ. ముసిఁడిమ్రాఁకునఁ బండ్లు పస మీఱఁ గల్గించి
యించున కేల పుట్టించఁ డయ్యెఁ
బిల్లగడ్డకుఁ దావి పెల్లుగా నొనఁగూర్చి
కుందనంబున కేల కూర్పఁడయ్యెఁ
బందిపెంటికి నై దుపదియుఁ గూనల నిచ్చి
పొసఁగ నేనిక కేల యొసఁగఁడయ్యెఁ
గాకిపిట్టకుఁ జాలఁ గడలేని బ్రదు కిడి
చిలుకకు దడ వేల చేయఁ డయ్యెఁ
తే. గొలముకోఱఁత గరాసుల కలవిగాని
దొరతనము గూర్చి కడుబల్లిదుల కదేల
తిరిప మెత్తంగఁ జేసె నద్దిర కరంబు
వింత లయ్యెను జదువుల వేల్పుపనులు. 111
వ. అని మఱియును. 112
తే. పాలమున్నీటిగారాపుఁబట్టిమగఁడు
వేడుకలు మీఱ ననుఁ బెండ్లియాడెనేని
గొప్పచింబోతుకదుపులఁ గూర్చి నీకుఁ
గావువెట్టింతుఁ జుమ్మి యోగంగనమ్మ. 113
తే. పూని యాదలఁ దలఁబ్రాలువోసి తాళి
బొట్టు మరుతండ్రి తన మెడఁ గట్టెనేని
వెండిపువ్వుల నపరంజివిరులచేతఁ
జెలఁగ నించెదఁ గోరి యోచిలువతాల్ప. 114
క. తనతలపై వడి బల్లిదుఁ
డనువొప్పఁగ గ్రొత్తముత్తియపుఁదలఁబ్రాలో
సినఁ దఱుఁగనియుండ్రంబులు
వెనకయ్యా నీ కొసఁగుదుఁ బ్రిదులనిబత్తిన్. 115

క. అని యెడ యొదవనికోర్కుల
మునుఁగుచు నిలువేలుపులకు మ్రొక్కుచు నాక్రో
న్న నఁబోఁడి పలుతెఱంగులఁ
దనలోనం దానె యపుడు తలఁచుచునుండెన. 116

తే. అనుచు సుగ్రశ్రవసుఁ డింపు పొనర నెల్ల
తపసితేండ్లకు నెఱిఁగింపఁ దనివి సనక
వార లవ్వలికతయును వలను మీఱఁ
దెలుపవే యని సద్దతోఁ బలుకుటయును. 117

ఆ. మత్తగిల్లుసత్తుగిత్తతత్తడి నెక్క
మిత్తి మొత్త సత్తి నత్తి బత్తిఁ
బత్తిరిడిన ముత్తిబుత్తులు రెండును
నొత్తిగుత్తగట్టుచుంపుటేఁడ. 118

ఉత్సాహ—

మొలను దోలుఁ దలను జాలు మొనలువాలు నిండువె
న్నెలలఁ బోలునోడలిడాలు నీటుదేలుచిల్కమైఁ
జెలఁగునాలు మలను బ్రోలుఁ జెడని మేలు గల్గి ని
చ్చలును సోలుకొనుచుఁ గ్రాలు జగములేలువేలుపా. 119

గద్యము. ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణాసంలబ్ధ సరసకవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండి న్యసగోత్రపవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్త్ర బుధజన విధేయ తిమ్మయనామధేయ ప్రణీతంబైన నీలాసుందరీపరి ణయం బనునచ్చతెనుఁగుఁ బ్రబంధమునందుఁ బ్రథమా శ్వాసము.

---

# ద్వితీయాశ్వాసము



క. సిరుల నిరవొందుగట్టుల
దొరకూరిమిపట్టిఁ గూడి తోరపుహాయలం
దిరమగునెమ్మిం జెలఁగుచు
సరిమీఱినవన్నె కాఁడ! జగములతేఁడా! 1

తే. విను నిరాబారితేండ్ల కవ్వొట్టచెవుల
తపసిరాయఁడు దనదుడెందంపుఁదమ్మిఁ
గ్రమ్ముకొనువేడ్క నవ్వాలి కతయుఁ జాల
నెలమి నెఱిఁగింపఁగాఁ బూని యిట్టులనియె. 2

బ్రాహ్మణుఁడు నందునితో వివాహవార్తను మాటాడుట.

ఉ. బల్లిదులార! నందుఁ డనుప స్మను వెల్లినజన్నిగట్టు ప్రే
పల్లెకు సంతసంబు మదిఁ బర్వఁగఁ గ్రమ్మఱఁ బోయి వేగయా
గొల్లకొలంపుఁబొల్కడలి క్రొన్నెలఁ గన్గొని వానికెంతయుం
దెల్లమిగాఁగ నిట్లనుచుఁ దెల్పెఁదొడంగెను నేర్పుపెంపునన్.

క. ఒడయండ! నీదుపంపునఁ
గడువడిఁ జని నీమఱందిఁ గనుఁగొని యతఁ డ
య్యెడ నిడుపూజల నెంతయు
నడరఁగఁ గైకొని కరంబు నర్మిలి మీఱన్. 4

ఆ. అతనిసేమ మెల్ల నరసినపిదప మీ
సేమ మతని కెఱుఁగఁ జెప్పి మేలి

రతనములఁ దనర్చు రవణమ్ములును బట్టుఁ
బుట్టములను మిగులఁ బుసుకు లంది. 5

క. వచ్చునెడం దనకన్నియఁ
దెచ్చి యతం డెదుట నిలిపి దీనికి నెన నై
మెచ్చు గను పెండ్లికొడుకును
నిచ్చలముగఁ దెల్పుమనుచు నెఱిఁ బల్కుటయున్. 6

తే. నీకు మేనల్లుఁ డగువెన్ను నికి నొసంగు
చాన నని పల్క నతఁ డంత సంతసిల్ల
వేయిదెఱఁగుల మీా కిది విన్నవించి
కర్జ మొనగూర్పుమని కోర్కె గదురఁ బల్కె. 7

క. కుందనపుబొమ్మ పోలిక
నందంబుల కెల్ల నిక్కయగునమ్ముద్దుం
గెందలిరుఁబోఁడి బెండిలిఁ
బొందుగ నొనగూర్పు పసిడిపుట్టము నొరకున్. 8

తే. తడయఁ బనిలేదు మేల్పని తగినచోటఁ
దగిన నొనరింపు మనుచుఁ బెద్దలు గడంగి
యాడుచుందురు గావున నతనితోడ
వియ్యమందంగఁ దగుఁ జుమ్ము వేయు నేల? 9

క. అని బొఁపనయ్య యిత్తెఱఁ
గున నేర్పున విన్నవింప గొల్లలచేఁ డ
ప్పని కియ్యకొని కరంబును
దనమదిఁ గడలేనివేడ్కఁ దనరుచు నుండెన్. 10

కృష్ణునికి బ్రాహ్మణుఁడు నీలను వర్ణించి తెల్పుట.

తే. పాఱుఁ డపుడెదఁ గడుఁబెంపుమీఱ నెలమి
నాలకాపరికడకు డాయంగఁజేరి
సంతసంబున నతనితో నంత కంత
కింపు దళుకొత్త మెల్లన నిట్టు లనియె. 11

సీ. విను సామి! నీతండ్రి పనుపున నీమామ
యగుకుంభకునియింటి కరుగుదెంచి
యతనిసేమంబెల్ల నారసి మీసేమ
మెలమితో నతనికిఁ దెలియఁ జెప్పి
యమ్మేటి యిడుమానికమ్ములు సొమ్ములు
వలువలుఁ గైకొని వచ్చునెడను
దనముద్దుఁబట్టి నీలను దోడితెచ్చి యుం
తయు నెమ్మి దీనికిఁ దగినపెండ్లి
తే. కొడుకుఁ దెల్పు మటంచు నక్కూర్మి నడిగి
మిమ్ముఁ జెప్పిన నతఁ డపు డెమ్మె నలరి
నందునకు మీకు నెఱిఁగించి పొందుమీఱ
నయ్య! యిప్పని యొడఁగూర్పు మనుచు వేఁడె. 12

తే. జాను మీఱినచానయు మేనమామ
కూఁతురును లేఁతపరువంపుగుబ్బెతయును
నెనరు కదిసిన దగుటను నీకు దాని
కోర్కు లివురొత్తఁ దవులుకోఁ గూడు నొడయ. 13

క. ఆకన్నియసోయగ మో
రా కాసులసూడ! పాఁపరాకొమ్మలయం

దేకడ నరసిన లేదు సు
మీ కడమ యిఁ కేల తెల్ప మీకడ మఱియున్. 14

ఆ. చామమోముగోము చందమామను గెల్వఁ
జాలు మేలుతేనెజాలుఁ బోలుఁ
గలికికులుకుఁబలుకు లలవెలందుక గొన
బారునారు తేఁటిబాఱుఁ గేరు. 15

ఉ. చిందము చందమామ సుడి సింగము రిక్కలు నువ్వుఁబువ్వు
మేల్, చెందొవ లద్దముల్ చివురు విల్లు మొగు ల్తరఁగ
ల్దొనల్కన,ల్కుందన మంచబోదలును గుబ్బలులు న్మగఱాల
తిన్నెలుం, బొందుగఁ గూర్చి యమ్మెఱుఁగుఁబోఁడిని నల్వ
యొనర్పఁబోలుఁ బో. 16

సీ. అడుగులు చెందొవలారు తుమ్మెదబారు
కన్నులు వాలికగండుమీలు
కుత్తుక చిందంబు గుబ్బలు జక్కవ
ల్మెమ్మోము విరిదమ్మి నెఱులు నాఁచు
నగవులు సుపవులు నడలు రాయంచలు
స్రుక్కులు తరఁగలు పొక్కిలి సుడి
మీఁగాళ్లు తాఁబేళ్లు మెఱుఁగుఁజేతులు తూండ్లు
చెన్నారుపిఱుఁదులు దిన్నియలును
తే. గాఁగ ననయంబుఁ బలుసోయగంపుఁగొలఁకు
నాఁగ నలువొందు నయ్యేలనాఁగ బాగుఁ
బొగడ నలవియె పలుకులపొలఁతి కైనఁ
జిలువదొరకైన మఱియు నన్నలువకయిన. 17

ఆ. కెంపుఁ బెం పడంప సొం పగువాతెఱ
మిన్నుఁ జెన్ను నెన్నుఁ గన్నె నడుము
మీల నేలఁ జాలు వాలుఁగన్నుంగవ
తేఁటిదాటుఁ మీటు బోటికురులు. 18

చ. పలుకులఁ దేనె లూరు మెయి బంగరునిగ్గులు దేఱుఁ జూపు
లం, దళుకులు మీఱుఁ జెక్కులను దద్దయు ముద్దులు గాఱు
మోమున,న్వాల పలారుఁ గ్రొమ్మొగులువన్నియఁ గేరును
గొప్పు తీరహో!, చిలుకలకొల్కి సౌరు నెఱిఁ జెప్పఁగ నల్వకు
నైనఁ దీరునే? 19

సీ. ఎలనాఁగతుఱుమున కెనగాక తుమ్మెద
కొదమకూటువులు సల్వాదలు దూఱెఁ
జానవేనలితోడ సరిగాక యొడలిచూ
పులదొరరతనముల్ పూరిఁ గఱచె
ననఁబోఁడినునుఁగొప్పునకు దీటుగాక ని
చ్చలును జీఁకటులు మూలలను డాఁగెఁ
గడుముద్దుగుమ్మక్రొమ్ముడితోడ దొర గాక
తొలుమబ్బుతుటుములు మలలఁ బట్టెఁ
తే. జూపఱకుఁ గొలఁదికి మీఱుసొంపు నింపుఁ
బెంపుఁగలయలచెలిచెలువంపునెఱుల
గుంపునకు జోకగాక నిద్దంపునాఁచు
జొంపములు నీటఁ బడుఁ గడుఁదెంపుచేసి. 20

తే. మగువమొగమున కెన గాక మిగులఁ బొగిలి
తొగలచెలికాఁడు పదియాఱుతునియ లయ్యె

సిరుల కిర వగు నెత్తమ్మివిరి దలంకి
యొయ్య నొయ్యన వేమాఱు వ్రయ్య లయ్యె. 21

క. పగడము మంకెనవిరియును
జిగురాకును దొండపండుఁ జెందిరమును సొం
పగుతమ్మి కెంపుగుంపును
ముగుదనిగారంపుఁదొగరుమోవికి దొరయే? 22

ఉ. పట్టికముందె క్రొన్ననలబంతులు గందును గోరు నాటఁగ
నట్టిగ నుండుఁ గొండలును గైకొన నబ్బక పోవు జక్కవల్
పట్టుగ రాసినం గరఁగి పారెడు మేలిపసిండిగిండ్లు నిం
కెట్టుగ నీడనం బొసఁగు నింతిమిటారపుగుబ్బదోయికిన్. 23

క. కొండలమెండును మారెటి
పండులసోయగము జక్కవలకూడిక పూఁ
జెండులపసయును బంగరు
కుండలమెఱుఁగు న్వెలందిగుబ్బల కడఁగున్. 24

తే. అలరుపొక్కిటిపొన్నపూవలన వెడలి
కులుకుఁజన్గుబ్బతమ్మిమొగ్గలకు సాగు
జమిలిముక్కాలికొదమపెంజాలనంగ
నలరుఁబోఁడికి మెఱుఁగారునారు దనరు. 25

ఉ. దానిపిఱుందునందమును దానిమిటారపుటారుసొరునున్
దానివెడందపొడఁఱుము దానిచొకారపుగబ్బిగుబ్బలున్
దానిజగానిగారమును దానియొయారపుఁదళ్కుఁజూపులున్
దానిమొగంబుఁ గన్న జడదారులకైన విరాళి మెత్తదే? 26

సీ. వలపులదీవి కెందలిరుజొంపముమావి
మరునిపూఁదూపు చేమంతిబంతి

యన్నులతలమిన్న యాణిముత్తెపుఁగ్రోవ
పండువెన్నెల నిగ్గుబలుకుఁజిలుక
కపురంపుబరణి నిల్కడఁ గన్న క్రొమ్మించు
పగడపుఁదీవ మేల్పసిఁడిబొమ్మ
కోదమరాయంచ కుల్కుమిటారి వన్నెల
గని చొకారపుమానికములమూట

తే. యాముకేనుఁగుగున్న యొయ్యారములకుఁ
దీరుకస్తురిలప్ప సొంపారుపికిలి
చెండు నాఁగఁ దనర్చి యచ్చెరువుమీఱఁ
దద్దయుఁ జెలంగుఁజుమ్మ యమ్ముద్దుగుమ్మ. 27

మ. పలుకు ల్వేయు నిఁకేల యాచెలువ యాబంగారుకీల్బొమ్మ
యా, కులుకుంబాయపుఁగల్కి యావలఁతి యాగోజ్జెగ
పూబంతి యా, యలరుంబోఁడులమిన్న యాముగుద యా
యందంపురాచిల్క యా,వలపుంగప్రపుదీవి యామగువ
యావాల్గంటి నీకే తగున్. 28

తే. చక్కఁదనమును గోసమును జవ్వనంబు
మక్కువయుఁ బ్రోడతనమును నిక్కువంబుఁ
దాలిమియుఁ గల్గునిల్లాలి నేలువాని
కారయఁగ వేల్పురాచప్రోల్గోర నేల? 29

చ. చెలువుఁడ! నీయెడం జెవులు చీఁదఱఁ జెందఁగఁ బెక్కులా
గులం, బలుకఁగ నేల? యాతలిరుఁబాయపుటన్నులమిన్న
చెల్మి నీ,కలవడెనేని మేలిపసమీఱువన్నెపసిండితోడ వే
ల్పులదొరమానికంపురవఁ బొందుగఁ గూర్చినచంద మౌఁ
జుమీ. 30

తే. ప్రౌఢలై చూడఁ దగుగొల్లపూవుఁబోండ్ల
చెలిమి గలదని దానిపైఁ దలఁపుమాన
వలదుసుమి! మంచిపనసపండుల మెసంగు
జాణలకు మావిపండులు చవియ కావె? 31

తే. కమ్మవిల్కాని చేతిపూఁగొమ్మ ముద్దు
గుమ్మ నిద్దంపుజాళువాబొమ్మ వలపు
గ్రమ్మనిమ్మగుకపురంపుదిమ్మ సుమ్ము
కొమ్మ నెమ్మె దలిర్పఁ గైకొమ్మ లెమ్మ 32

నీలయందనివలపును కృష్ణుఁడు విప్రునితోఁ జెప్పుట.

క. అని పంటవలఁతి జేజే
వినిపించిననాలకించి వ్రేతలమేల్వాఁ
డెనలేనికోర్కు లెదలో
నసలెత్తఁగ సతినిఁ జూచి నగుచుం బలికెన్. 33

ఉ. ముందొకకర్జ మూని చని ముద్దులగుమ్మ నొకర్తు నక్కడం
బొంచెక నేసి రాసిరులు పూన్చుచు వేమఱు వీనుదోయికి
న్విందొనరించి తా మిగుల నేర్పున నోబలు నేలవేల్ప! మే
ల్పొందఁగ మీకుఁ జెల్లుఁగద పొల్పుగ మేల్పను లెల్లఁ
గూర్పఁగన్. 34

క. చెన్నొదవెడునన్నవలాఁ
గన్నారం గన్ను లలరఁ గన్గొనియెదు మే
లెన్నఁడు గల్గునొకో యని
యెన్నెదఁ జుమ్మయ్య మిగుల నెదలో నెపుడున్. 35

సీ. కలికినెమ్మోముజాబిలిరంగు లోదవక
చెలువంపుఁగనుఁదోవల్ చెలఁగు టెట్లు?
సకియనుంగెమ్మోవిచక్కెర ల్జుట్టక
వలకాఁక పెనుదప్పి వదలు టెట్టు?
లెలనాఁగబిగికవుంగిలిజోడుఁ దొడుగక
యెద నంటుబలుతూపు లెడలు టెట్లు?
కొమ్మసింగారంపుఁగొలఁకునం దేలక
బలువిరాలపువెట్ట దొలఁగు టెట్లు?
తే. మెలఁతుకలమిన్న నిద్దంపు మేల్పసిండి
గలుగకుండిన మదిలోన గాట మగుచు
నిచ్చలును హెచ్చుకలఁక నిప్పచ్చరంబు
విడుచు టెటులింకఁ బరికింపఁ బుడమివేల్ప! 36

తే. కులుకుఁబాయంపుముద్దులగుమ్మ గలుగు
సొగసుకానికిఁ దెలిగంటిచిగురుఁబోఁడ్లుఁ
బులుఁగురాచేడియలును జక్కులవెలందు
కలును వీనులకంటిచెల్వలు నిఁకేల? 37

క. కన్నియలా గంతయు నిటు
విన్నప్పటినుండి తలఁపు వేఱొకపనిపైఁ
జెన్నలర దెన్ని తెఱఁగుల
నన్నెలఁతుకఁ గూర్చిఁ బెండ్లియాడెదఁ జుమ్మీ. 38

తే. జాళువాబొమ్మకెన యనఁజాలు వాలుఁ
గంటి నన్నన్న! కన్నులఁ గంటినేని
వలవకున్నను నీకు మేల్వాలునలిత్తు
నేలవేలుప! యిఁక వేయునేల? వినుము. 39

చ. అని తెలిదమ్మికంటి మదివంటి పెనంగొనుకూర్మి నాడినం
గనుఁగొని జన్నిగట్లతలకట్టపు డెంతయు నుబ్బి సామి! నీ
కనికర మింత నాపయినిఁ గల్గినఁ జాలుఁ గొఱంత యేమియుం
చును వెరవొప్ప నిట్టులనుచుం బొగడంగఁ దొడంగె
నద్దొరన్. 40

కృష్ణుని విప్రుఁడు పొగడుట.

దండకము సిరిమగఁడ! నిన్నుం దిరంబొప్ప నప్పాఁపఱేఁ డట్టి
రాయంచవారువంబుజోదైన నోరార నగ్గింపలే రన్నచోఁ
బిన్న లెల్లెన్నఁగాఁ జాలువా? రెన్న నోయన్న! ముగ్గాళ
రాకాసిబల్మూకటువ ల్మోవఁగాలేక పెన్ బ్రేగునన్ లోఁగు
నమ్మున్నుఁబూఁబోఁడికై ప్రోవులై కూడి జేజేదొరల్
వేఁడఁగా వేడబం బొప్ప నివ్వేసమిట్లూని తా నీవు గావించు
చెయ్వు ల్నెఱిం బూని వాక్రువ్వ నెవ్వారికిం దీరు?
మున్నీనుమే నూని మున్నీరు సొత్తెంచి ప్రాఁబల్కుముచ్చు
న్వాడి న్వ్రచ్చి నెత్తమ్మిపూఁజూలి నుబ్బింపవా? పెంపు
రాణింపఁ దొల్వేల్పులు న్వేల్పులుం గూడి పాలేఱువే త్రచ్చు
చో మేటితాఁ మేటిమై యెత్తి మవ్వంపుఁగవ్వంబుగ క్రైపున
న్వీఁపునం దాల్పవా? నేలయెల్లం దగంగొంచుఁ బెంజిల్వరా
లెంకికిం బాఱునాజాళువాకంటి రేద్రిమ్మరిన్ జన్నపుంబందివై
త్రుమ్మవా? కన్నపట్టిన్ ఉలిం బట్టి కాఱించునవ్వేల్పుసూళె
లికం జక్కఁగా నుక్కుఁగంబంబునం బుట్టి చక్కాడవా?
గుజ్జురూపూని మూఁడంజల న్జగంబుల్ గరంబొప్ప
నాఁకట్టి చాగంపుబల్ రక్కసుం గ్రిందికిం ద్రొక్కవా?
గండ్రగొడ్డంట ముయ్యేడుమాఱుల్ కడుందిట్టవై గట్టిగా

నేలతోఁడ్లం బడఁగొట్టవా? గోత్రికై కోఁతు లాయెల్లులుం గొల్వఁగా నుప్పసంద్రంబుఁ బూఁదోఁటకాల్వన్ వలెన్ దాఁటి చాల్పుందలల్ గల్గురాకాసిఁ బోకార్పవా? దుక్కి వాల్ పూని పేరుకున్నన్ రేఁగవా? మ్రాఁకులోఁదూఁటి తోల్వేల్పుఁబూఁబోఁడ్లబల్ నోములోఁకుమ్మడిన్ బన్న మొందింపవా? దొడ్డగుట్టంబుపై నెక్కి యుప్పొంగుచుం దుల్వరాపోఁజులం ద్రిప్పవా? దేవరా! నీవెకా వేలుపుం బెద్దవై తద్దయు న్నేర్పుతో నిజ్జగం బెల్లఁ బుట్టించి వెన్నుండవై నిచ్చలు న్మచ్చికం బ్రోచి యామీఁద ముక్కం టివై తీర్తు వెల్లప్పుడు న్నీ మెఱు న్నల్వ గ్రుడ్డంగముల్మేడి పండ్లునవ్వలెం బ్రోవులై యుండు నీబూటకం బెవ్వరున్నేటుగా నారయన్ లేరుగా? నిన్నుఁ బేర్కొన్నఁ గన్గొన్న నీబల్లి దంపుంగతల్ విన్న దోసంబులెల్ల న్వెసం బాయు నీమెట్టి కెందామరం బుట్టి చెన్నారుమిన్నేటినీ రింత మై సోఁకఁ బున్నెంబులెన్నేనియుం గల్గు నిష్పత్తితోఁ గొల్వఁగా లేక టాటోటులై పెక్కురిల్లాండ్రనుం బాండ్లనుం బుత్తడుల్ మేడలు న్మాడలుం గోకలున్ రూకలున్ గొఱ్ఱెలు న్బఱ్ఱెలున్ మేడలు న్గోడలుంజూచి వేసారకే కాఁపురంబు ల్దిరం బంచు డెందంబుల న్నమ్మి తారూరకే మేలులంబాసి యామీఁదట న్దుంతబాబావజీరుండు గాఱింప మీఱిన్ దోసంగుల్ వెసుంబొందవా రెందఱం జూచి బిట్టేడ్చుచందంబులన్ రోసి యిల్లాసి తారెల్ల చెయ్వుల్ విడంగోసి కారాకులు న్దుంపలు న్మెక్కి లోఁ జొక్కుచుం బ్రాంతపల్కుం గొన ల్సారెకుం గాంచి మే ల్దెల్వితో లోనివెల్గుం గనుంగొంచు

వేమాఱు మైసోఁకి రాఁబారులెల్ల నిట్టటం బొప్ప నీకు గానఁగాఁ
నేర రెవ్వారికిం గీడు గావింపఁగా నోడి యేకోర్కులు న్వేడి
నీపైఁ దలం చెప్పుడు న్నిల్పి లోఁ దాల్మి వైవాఱఁగాఁ
జెయ్యు లేమైన నీ కప్పనం బంచుఁ బూఁట ల్వాడిం ద్రోచు
నా బల్లిదు ల్నీకు విందుల్గదా! నీవు కూర్మిం గనుంగొన్నచోఁ
గాక నే నిన్నుఁ గొండాడఁగా నెంతవాఁడ న్నిజం బొప్ప,
నన్నల్వవు న్నీవె వెన్నుండవు న్నీవె ముక్కంటివి న్నీవె
జాబిల్లివిం బ్రొద్దవు న్గాడ్పవు న్నీవె ప్రాఁబల్కులు న్నీవె
సంద్రంబులు న్నీవె గట్టుంగముల్ మ్రాఁకులు న్వాఁకలు-
న్నీవెకా నెంచి నిన్బత్తి నే ప్రొద్దునుం గొల్చెదన్. 41

తే. అనుచుఁ గైవార మొనరించు నవ్వాలంతి
మన్ను వేలుపు మేల్బంతి మదికి మీఱ
వేడ్క లొసగూర్చి పనిచి యవ్వెన్నుముచ్చు
చెలువ చెలువంబె పలుమఱుఁ దలఁచుచుండె. 42

కాలనేమికొడుకు లాఁబోతులై పుట్టి జగములను గాసిఁ బెట్టుట.

సీ. అంతట మిథిలలో నలకుంభకునియింట
మును కాలనేమికి ననుఁగుఁగొడుకు
లగుతుల్వరక్కసు లాఱునొక్కరు దొడ్డ
యాఁబోతు లై పుట్టి రచ్చెరువుగఁ
జొట్టువాల్దాలుపుసూడు లెంతయుఁ గ్రొవ్వి
యొనలేనిలావున నెల్లకడల
మెలఁగుచు పసినెల్ల మేయుచుఁ గోడలు
వెలుగులు పెండెము ల్వ్రీలఁగఁ ద్రొక్కి

తే. దొడ్డిపట్టుల నిల్వక త్రోవ నెవరి
నెదిరి కొమ్ములఁ గ్రుమ్ముచుఁ గదిసి కోడె
తఱపులను బొడ్చుచును వడిఁ దవిలి ఱంకె
లిడుచుఁ బొగరెక్కి యుక్కున నడరి రెలమి 43

క. బెబ్బులులనైన మార్కొను
నబ్బురపుం జేవ గలిగి యాసతగిబ్బల్
నిబ్బరముగ నాఁడెంపుం
గుబ్బలు లిటు లయ్యె నేమొకో యన నలరున్. 44

ఆఁబోతులయుపద్రవమును బ్రజలు రాజుతోఁ జెప్పుట.

క. చెలరేఁగి యిట్టు లెల్లెడఁ
గలయం ద్రిమ్మరుచుఁ జాల గాసి యొనర్పం
దలఁకి పజ లెల్ల నప్పుడ
గ్గల మగుకడగండ్లఁ జిక్కి గములై సరగన్. 45

తే. పనసపండులు దబ్బపం డ్లనఁటిపండు
లీడపండులు టెంకాయ లిప్పపూలు
చెఱకుఁగోలలు దేనియ ల్తఱచుగాను
గొనుచుఁ బఱతెంచి రెకిమీనికొలువునకును 46

తే. అరిగి మెల్లన గవనికాపరులచేత
నేలికకుఁ దమరాకడ యెఱుఁగఁ జెప్పి
యతనియానతిఁ గైకొని వెతలు మఱచి
నగుచు నందఱు గొబ్బున నగరుసొచ్చి. 47

సీ. మగమానికములక్రొన్ని గనిగల్ దులకింప
బలుతమ్మికెంపుమే ల్పసలు నింప

రేరాచఱాచాయ క్రేవల నలరంగఁ
బులుఁగుఱాపచ్చరంగులు పొసంగఁ
గఱిరతనంపుఁ జొక్కపుసిరు ల్దళుకొత్తఁ
బగడంపుగుంపు కెంజిగి యొనర్పఁ
దెలిక్రొత్తము త్తియంబులడా ల్దువాళింప
వెలుఁగురాఱాహొరంగులు వెలుంగ

తే. మఱియుఁ జే రగునాఁడెంపుమానికంపు
గముల నిద్దంపువన్నియ ల్గడలుకొనఁగ
నందముల కెల్ల నునికిప ట్టనఁగఁ జాలు
మేలిపని నొప్పుజాళువా మేడలోన. 48

తే. దొరలు మన్నీలు చెలులు బందుగులు జెట్లు
బంట్లు కబ్బంపుఁగూర్పరు ల్పాళెగాండ్రు
గడనచేడియ లూడిగీల్ గాణ లొజ్జ
బాఁపనయ్యలు దీర్పరుల్ బలసి కొలువ. 49

సీ. బంగారుఁదగటుదుప్పటి చెఱంగులరంగు
మేచాయకొక క్రొత్త మెఱుఁగు చూప
బలుము త్తియపుఁజొకటులడాలు నిద్దంపు
బవిరిగడ్డముమీఁదఁ జవుకళింపఁ
బూపవెన్నెలతేనిఁ బోలు నెన్నొసలిపై
జిలుఁగుఁగ స్తురిబొట్టు చెలువుమీఱ
సొగసుగా విరిసరుల్ చుట్టి గట్టిగ నిడ్డ
సిగ పెంపునాఁడెంపు సిరుల నీన

తే. గొప్పరతనంపుఁబలకము ల్గొలుసులుంగ
రములు మురువులు సింగార మమరఁబూని

వేడ్క- లిగురొత్త రెండవ వేల్పుతేని
కరణి గొలువున్న దొరఁ బొడగాంచి యపుడు. 50
తే. తమరు గొని చన్న సరకు లెంతయును బత్తి
సప్పనము సేసి మిగుల జోహారు లొసఁగి
కేల్గవలు మోడ్చుకొని యొకక్రేవ నిలిచి
యెదలఁ గొంకుచు వాక్రుచ్చి రిట్టు లనుచు. 51
క. దేవర! నీ వీపజలను
బ్రోవఁగ నిన్నాళ్లదాఁకఁ బొదలుచు మేముం
ఠీవి దలిర్పఁగ నెదలో
నేవెఱపును లేక యుంటి మెడలనికడిమిన్. 52
క. ఇప్పుడు నిదె యచ్చెరువై
చెప్పంగా రానిదొడ్డ చే టొనగూడెం
దప్పక యాలింపుము నీ
విప్పట్టునఁ గినుక లేక యెలమి దలిర్పన్. 53
ఉ. గొల్లలనాయఁడై పరఁగు కుంభకుమంద న దేమివింతయో
కల్లరిగిబ్బ లేదు పొడ.గట్టి పజం గడు గాసిఁ బెట్టుచుం
గొల్లగ నెల్లపైరులను గొంకును జంకును లేక మేయఁగాఁ
దల్లడ మంది వచ్చితిమి తద్దయు మీకిది దెల్పుకోరికన్. 54
క. గిబ్బ లవి కాఁపువారల
గొబ్బున నొకముద్దఁ జేసి కొని మ్రింగుఁజుమీ
దబ్బఱలుగఁ జూడకు మో
యబ్బా బెబ్బులులకైన నటు జంకుదుమే? 55
క. చలపాడిచి ఱంకె లిడుచును
బలుమఱు ముంగాళ్లఁ ద్రవ్వి బలువిడిఁ బసికాఁ

పులఁ గ్రుమ్మివిడుచుఁ బైకొని
పొలమంతయు నవియె యగుచుఁ బోగరు సెలంగన్. 56

తే. ఆకుఁదోఁటలు నుగ్గాడి యరఁటితోఁట
లెల్ల మల్లడిగొనఁ ద్రొక్కి యుల్లికంద
పసుపుఁదోఁటలు జంగిలి ఁసవుబీళ్లు
చెఱకుఁదోఁటలు పండినచేలుఁ దీర్చె. 57

క. ఓరాయఁడ యీయంగద
కోరువలే కిటకు వచ్చె నూళ్లన్నియు మే
మూరక దబ్బఱలాడఁగ
నేరము నూఱార్లకయిన నీయాన సుమీ. 58

ఆఁబోతులఁ బట్టింపు మని రాజు కుంభకున కాజ్ఞాపించుట.

చ. అన విని నేలతేఁడు వెఱఁగందుచు వారల నూఱడించి యి
ప్పని సవరింతుఁ బొండనుచుఁ బంపి యెదంగడుఁగిన్కమీఱ
గొల్లని బిలిపించి నీవు పదిలంబుగఁ గోడెలఁ బట్టుకున్న నా
మునఁ దనరారుచుణ్ మొదలుముట్టఁగ మేయును బైరు
లన్నియున్. 59

క. గట్టిగ నీ విఁక వానిం
బట్టింపుము గాక యున్నఁ బంటింపక పెం
గట్టడవి కయిన వెడలం
గొట్టింపుము చేయవేనిఁ గొఱగాదు సుమీ. 60

క. బలుసిరి గలుగుట కోరులం
గలఁచుట యెవ్వారి కయినఁ గటకట తగునే?
బలిమి గలవాఁడ వగునీ
కలగిబ్బలఁ బట్టరాదె యాఱడి మేలే? 61

తే. అనుచు నోడయఁడు నుడివిన విని యతండు
తలఁకి యోతండ్రి యాకోడియలను బట్టి
గట్టిచేసెద నీక నింత కసరవలవ
దంచుఁ గడు వేడుకొని యింటి కరిగె నపుడు. 62

ఆఁబోతులను బట్టం బూని గొల్లలు భంగపడుట.

క. తనచుట్టంబుల నందఱ
బనివడ రావించి తెనిపలుకులు దెలియన్
వినిపించి గిబ్బలను గో
బ్బునఁ బట్టఁగవలయు నంచుఁ బురికొల్పుటయున్. 63

తే. గొల్ల లెల్లను బెల్లుగ వల్లియలును
బల్లిదపులంజెపలుపులు మొల్లముగను
బూని యమ్మేటిపొగరుటాఁబోతుతుటుము
బలిమి మెఱయంగ డాకొని పట్టఁ దొడఁగి. 64

క. వలత్రాళ్లు వైచి యయ్యెడఁ
బలుమాఱును దఱిమి యురులు పన్ని కడున్ దో
డ్డలు నాఁగి మోది యోదం
బులు ద్రవ్వియుఁ బెక్కుచందములఁ బెనఁగునెడన్. 65

సీ. వలపగ్గములు ద్రెంచి కలఁబడఁ గొందఱ
బొట్టలు వ్రయ్యంగఁ బొడిచి పొడిచి
యెగసి చెంగున దాఁటి పొగరునఁ గొందఱ
డొక్కలు నలియంగఁ ద్రొక్కి త్రొక్కి
తొడరి పట్టఁగఁ బోవఁ దొడఁగినఁ గొందఱఁ
దలల నెత్తురు లుర్లఁ దాఁచి తాఁచి

కెరలి పేరెమువాఱి యురవడిఁ గొంపఱఁ
దుమురుగాఁ బుడమిపైఁ ద్రోచి త్రోచి
తే. గబ్బితనమున హెచ్చి య గ్గిబ్బకదుపు
నిబ్బరంబుగఁ బట్టంగ నబ్బకున్న
జబ్బువడి యందఱును గడు నబ్బురముగ
బొబ్బ లిడుకొంచుఁ బాఱిరిఁ ప్రోలిదరికి. 66

క. అటువలె బలియురు పెక్కం
డ్రటమటమైఁ జన్న విన్న నగుచున్ మిగులన్
దిటము చెడి గొల్లనాయఁడు
కటకటఁ బడి యింక నెద్ది కష్టం బనుచున్. 67

ఆఁబోతులం బట్టినవానికి సీల నిచ్చునట్లు కుంభకుఁడు చాటించుట.

తే. కొంతతడ వెంతయును మదిఁ గుంది యొడయఁ
డేమి గావించునో యిఁక నెట్టు లతని
మ్రోలఁ దెల్పుదు నీయాముటాలపోతుఁ
బిండు నెవ్వాఁడు గెల్వఁగలండు పూని. 68

తే. తడయఁ బనియేమి మినుపిగదయ్య మింక
నెట్టు గావింప నున్నాఁడో యెవ్వఁ డెఱుఁగు
నబ్బురం బొప్ప నిత్తఱి నహహ యెట్టి
కీడునకుఁ బుట్టెనో యిట్టిగిబ్బ లేదు. 69

క. అని యెందు వెరవు దోఁపక
పనివడి యిక్కోడియలను బట్టఁగఁ గలజా
ణని కిచ్చెద నీకన్నియ
నని యెల్లెడలందుఁ జాట ననిచెన్ సరగన్. 70

## తండ్రి చాటించుటను విని నీల చింతించుట.

క. అటులఁ దనతండ్రి చాటిం
చుట చెలికత్తియలవలనఁ జొప్పడ విని మి
క్కుటమగువంతలఁ గుందుచు
దిట వింతయు లేక నీల దిగులెదఁ బొదువన్. 71

ఉ. అక్కట! తండ్రి యేల మఱునయ్యకుఁ బెండ్లియొనర్తునంచుఁ బె
న్మక్కువనుండుచోఁ దెఱఁగుమాలినటక్కరియాంలపోతులి
ట్లెక్కడనుండి కల్గె? నిపు డెవ్వరు నెవ్వగఁ దీర్చువార ల
మ్మక్క!హుళిక్కియాసనసయంబుమది న్వెతఁజెందనాయెఁగా.

క. ఇత్తెఱఁ గంతయు నిపుడా
పుత్తడిదువ్వలువతాలుపున కెవ్వారల్
బిత్తి నెఱిఁగించి యెదలోఁ
దత్తఱ మంతయును దీర్పఁ దగియెడువారల్? 73

తే. వెన్నుఁ డీమాట వీనుల విన్నయపుడె
వచ్చునో లేక యీపని కిచ్చ యిడఁడొ
వచ్చి గిబ్బలఁ గూల్చునో వానివలన
వీఁగి యేఁగునో యిఁక నెద్ది వెరవు గలదు? 74

తే. సోఁకుమూఁకలగొంగ యిచ్చోటి కెమ్మె
లూర గొబ్బున వేంచేయ కుండెనేనిఁ
జెల్లబో యింక నెటువంటి చెనఁటిగొల్ల
చెట్టఁబట్టంగ దయ్యంబుఁ జేయునొక్కొ. 75

సీ. దట్టంపుమిన్నాఁకతరఁగచాల్పునఁ దేలు
తెలిపుల్గు బురదగోతులకుఁ జనునె?

పుడుకుప్రాస్వలితావిపువ్వుఁ దేనియలాను
మగతేఁటి తుమ్మకొమ్మలకుఁ జను నె?
తొలుమొగుళ్లిడుచిన్కు లెలమిఁ గ్రోల్వానకో
యిల బలుమంచుసోనలకుఁ జను నె?
పరువంపుఁ గ్రొమ్మావిపండు లేపున మెక్కు
చిలుక గాటపుటుమ్మెతలకుఁ జను నె?
తే. పక్కిరాజక్కిదొరచెల్మిఁ జక్కఁ గోరి
చొక్కుచుండెడుడెంద మమ్మక్క యొక్క
తులువమానిసితోడఁ బొందునకు నిచ్చ
యిడఁగఁ జూచునె తలఁప నెయ్యెడలనైన? 76

తే. పుడమిలోపల మగవాఁడు పూని తనకుఁ
గోర్కి యగుకల్వకంటిఁ గైకొనుచునుండు
నహహా! తమమది కిచ్చయౌనట్లు మెలఁగఁ
గన్నియలకేమిటికి బల్మి గలుగ దయ్యె? 77

సీ. వ్రేపల్లెనుండి మున్నెపుతో నిచటికి
నేల వేలుపుఁబెద్ద యేల వచ్చె?
వచ్చి మచ్చికమీఱ హెచ్చుగా హాంబట్టు
సాలుదాలుపుఁగత లేల తెలిపెఁ
దెల్పినఁ దండ్రి యచ్చెలువున కీజవ
రాలి నిచ్చెద నని యేల పలికెఁ?
బలికినమాట యేర్పాటుగా విని తన
యెదఁ గూర్మి యతనిపై నేల పొడమెఁ?
తే. బొడమెఁగాకేమి పొగడుటాఁబోతు లేదు
నిత్తెఱుంగున దొడ్డిలో నేల కలిగెఁ?

గలుగుటకు నేలతేఁడేల కాఁక సేసె?
నయ్యయో! దయ్యము నీకేమి యనఁగఁ గలదు? 78
తే. చిలుకవార్వంపుమేటివజీరుఁ గేరు
నాలకాపరిసోఁమగం బనువుమీఱఁ
దలఁచినప్పుడే మొకాని డెందమున దిగులు
పాయఁగా నేర దిఁక నేమి సేయుదాన? 79
క. ఇప్పని దలిదం(డ్రు)లకుం
జెప్పఁగవలె నంచుఁ దలఁప సిబ్బితి మిగులన్
ముప్పిరిగొనుచుం బైపయిఁ
గప్ప నొరులచాటువారు గారే కన్నెల్? 80
చ. వలనుగ మేలుగీల్లు గుడువం దగువారని నమ్మి యెంత
యుం, జెలిమి దలిర్ప నిత్తెఱఁగుఁ జెప్పఁగఁ జూచిన సారె
సారెకుం, గిలకిల లాడుచున్న గులఁ గేకలుగొట్టుదు రింతె కాని
చిక్కులు సడలించి మేలుపనిఁ గూర్పఁగ నేర్తురె రాచ
నెచ్చెలుల్? 81
తే. అలర వలమురితాలుపుచెలిమి తనకుఁ
గలుగకుండిన వేల్పోక తులువ నింక
వలవ నెవరేమి చేసినఁ దలఁక నంచు
నంతకంతకు నగ్గలం బై నతమిని. 82

—◎ నీల మన్మథావస్థలంబడుట. ◎—

సీ. కనుదోయి కెలఁకులఁ గ్రమ్ము పెన్నీటిజా
ల్బలితంపుగబ్బిగుబ్బలను ముంప
సుడివోని వేఁడినిట్టూర్పుగాడ్పుల బ
ల్వడలఁ గెంజిగిమోవి వాడువాఱ

వెడవిలుకాఁడు బల్విడి నించుపూవంప
    జల్లుపెల్లున మేను దల్లడిల్ల
దట్టంపువలపులఁ దమి బెండుకొని సారె
    సారెకు గుండియ జల్లనంగఁ
తే. దాళఁజాలక మదిలోనఁ దగులుబాళిఁ
గూలి సోలుచుఁ జాల విరాళిఁ దేలి
తేలి నెచ్చెలిబారుఁ బోఁదోలి మేలి
పూలపానుపుపై వ్రాలి వాలుఁగంటి. 83

క. ఉసురసు రనుచుం బొరలును
గసరును బస దఱిఁగి వెసను గడగడ వడఁకు
న్విసువున బుసవెట్టును వె
క్కస మగు వలరాచసెగలఁ గ్రాఁగుచు మఱియున్. 84

సీ. తలయూఁచుఁ దనలోనఁ దాన నవ్వుఁ గలంగుఁ
    గలవరించును బయల్ గౌఁగిలించుఁ
బిలువకే పలుకుఁ గన్నులు మూయుఁ జెక్కిటఁ
    గైసేర్చు బెదరు సల్గడల్లు వెదకు
వలిగాడ్పు దూఱు నంచలఁ దోలు దయ్యంబుఁ
    దిట్టు మైతొడవులఁ దీసి వైచు
బోటులఁ గసరు గొబ్బున లేచి చిల్కల
    నడుచుఁ బల్మఱుఁ గొప్పు విడిచి ముడుచు
తే. నళుకుఁ జిడిముడిపడి సొమ్మసిలు దిటమ్ము
లేక కన్నీరు నించు సళించు నోకి
లించుఁ బిమ్మట గొను దత్తఱించుఁ జాల
నలరువిలుదాల్పుతండ్రిపైఁ దలఁపు నిలిపి. 85

చెలికత్తెలు నీలకు బుద్ధులు చెప్పుట.

క. అట్టియెడఁ జెలిమికత్తియ
లట్టియలుగఁ గూడి చేడియం గని యని రీ
బెట్టిదపువగలఁ బొగులుచుఁ
గట్టా నీ విట్లు డయ్యఁగాఁ దగునె చెలీ! 86

తే. కన్నియవుగాని ప్రోడవు గావు నీవు
పువ్వుఁబోఁడిరో సిగ్గెల్లఁ బోవ నడిచి
బలుదొసంగులఁ బొసలఁగఁ బాడ నీకు
నించుకేనియు మదిలోన నెంచ వకట! 87

సీ. అద్దంబు గని తద్ద నిద్దంపుఁగస్తురి
ముద్దునెన్నొసలిపై దిద్దవేమి?
కుప్పలై కప్పున నొప్పారుపెన్నెఱు
లింపుగా దువ్వి పాటింపవేమి?
యొమ్మె నిమ్ముగ మానికమ్ములసొమ్ము లం
దమ్ముగా నెమ్మేనఁ దాల్పవేమి?
పెట్టెఁ బెట్టినయట్టిజట్టిమీఱినపట్టుఁ
బుట్టముల్ మట్టుఁగాఁ గట్టవేమి?
తే. కోరి యోరిమి నోరెంబు గుడువవేమి?
తొడర వలిదావివిరిసరుల్ ముడువవేమి
సునుపుదళుకొత్తఁ బలుకులు నుడువవేమి?
చామ! నీకిది యెటువంటిజాడ చెపుమ. 88

క. పలుతెఱఁగులఁ గలఁగుదు విటు
వలెఁ గొదుకఁగ నేల? లాఁతివారమె నీకుం?

దలఁపునఁ గలపనియెల్లను
దెలుపవె మాతోడఁ బలికి దిటముగఁ గలికీ! 89

క. తగులమునఁ దగిలి నీ వీ
పగిది న్బిగి తఱిఁగి రేయుఁ బవలు న్మిగుల
న్వగలం బొగులఁగఁ దగవా?
మగువా! నగువారి నెట్లు మఱిఁ దలఁపవయో! 90

సీ. చిలుకబోదల మచ్చికలుచేసి ముద్దులు
చిలుకఁ బద్దియములు చెప్పరాదె?
తెలిపిట్టగమిఁ జేరఁదీసి తద్దయు బుద్ధి
దెలిసి మెల్లన నడల్ దీర్పరాదె?
నెమ్మికూటువుల గాటమ్ముగాఁ గూరిచి
నెమ్మితో నాటలు నేర్పరాదె?
బట్టికాఁడుల నింపు పుట్టునట్టుగఁ గేఁకఁ
బట్టి పాటలఁ గఱపంగరాదె?
తే. చెలఁగి పూఁదీవియలఁ బ్రోది సేయరాదె?
మేలిరతనంపువీణియ మీటరాదె?
నలువుగా నెచ్చెలులఁ గూడి నవ్వరాదె?
కలికి! నీడెందమునఁ జిక్కులుకుమాని. 91

చ. పలుకుచుఁ జేరి యాటలకుఁ గూరిమినెచ్చెలు లెచ్చరించినం
బలుకవదేమి? యేమఱక పజ్జల నిల్చినయూడిగంపుటిం
తులఁ గని తద్దయుం గినుకతో నదలించెదవేమి వేమఱుం
జిలుకలకొల్కి! నీవెడఁగుఁజిన్నియ లెన్నఁగఁ గ్రొత్తలి త్తఱిన్.

క. లేమా! నీవెత మానుప
లేమా మోమోటమున సళింపఁగ దేవుని

లే ? మాఱుమాట యొసఁగుము
వేమాఱును దలఁక నేల వేదుఱు మీఱన్ ? 93

తే. బేల ! యీ బేరజప్రుఁదనం బేల ? యింక
నాన యింతయు మదిలోన నానఁబోక
నిచ్చలం బొప్ప మాతోడ నిచ్చ్చలైన
దెల్ల నెఱిఁగింపు మెంతయుఁ దెల్లముగను. 94

క. అని యనుఁగుంజెలు లిత్తెఱఁ
గునఁ బల్కిన నాలకించి కోమలి మిగులం
దనడెందంబునఁ గోరిక
లినుమడి యై నెగడ వారి కిట్లని పలికెన్. 95

చెలికత్తెలతో నీల తనతలఁపుఁ దెల్పుట.

తే. వినుఁడు చెలులార ! నామాట నెనరుమీఱఁ
దలఁపులోవార లౌ మీకు దాఁపనేల?
డెంద మంతయుఁ గఱివేల్పునందుఁ దగిలి
మరలఁగానేర దిఁక నెద్దివెరవు చెప్పుఁడ. 96

ఉ. చక్కెరవింటిజోదు నెకసక్కెములాడఁగఁ జాలుపక్కిరా
జక్కివజీరుచెల్వు చెవిఁ జక్కఁగ నాటిననాఁటనుండి య
మ్మక్క ! యదేమొ కాని యెద నంటినకూరిమి యంతకంత
కుఁ, వెక్కసమై పెనంగొనుచు వేమఱుఁ బాయ దిఁకేమి
సేయుదున్? 97

ఆ. మిన్నజన్నిగట్టు గ్రొన్నెల వెన్నుని
వెన్నుమీఱి నప్పు డెన్న మున్న
విన్నకతన నెపుడుఁ గన్నులఁ గట్టిన
ట్లున్న దెడము లేక యన్నులార ! 98

తే. తప్పులెన్నక మొదలినేస్తంబుఁ దలఁచి
యిప్పు డిప్పని యొనగూర్పుఁ డొప్పుమీఱ
మీర లొనరించునట్టియమ్మేలు మఱచు
దానఁ గానుజుఁడీ యెందు జాణలార! 99

క. అనుచుఁ గడలేనియంగద
గనఁబడ నప్పడఁతి వేఁడికన్నీ రొలుకం
దన తెఱఁ గెఱిఁగించిన విని
యనుగుంజెలు లెల్ల దాని కని రిట్లనుచున్. 100

చెలికత్తెలు నీల సెగ్గులాడుట.

క. కన్నియరో! యంతపని కయి
వన్నియు వాసియును దఱిఁగి వగచెద వకటా!
నిన్నేమి యనఁగఁ గల? మీ
మున్నరికలు వినుట లేదు మున్నెచ్చోటన్. 101

క. లిబ్బులచెలి పెనిమిటిపై
నబ్బురపున్వలపు నిలిపి యలమట మీఱన్
సిబ్బితి విడిచెదు నీకున్
గబ్బితనం బిట్టు లేల కలిగెనె పొలఁతీ! 102

చ. కడఁక యొకింత లేనివలకాఁకలఁ గ్రాఁగుదు లోగి టాఁగ
వై, చిడిముడిపాటుతోఁ జెలులఁ జెంతలఁ జేరఁగ నీక తద్ద
యున్, గడుసుఁదనంబుఁ బూని సరిగన్నియ లందఱు నవ్వ
నయ్యయో, యడఁకువ మాలి యిప్పగిది నాడఁగఁ జెల్లునె
ముద్దుఁగన్నెకున్? 103

సీ. తెలిదమ్మికంటి యిప్పలుకు విన్నంతనే
కడలేని వేడ్క నిక్కడకు వచ్చు

వచ్చి యచ్చెరువుగా రెచ్చి పాతెడుగిబ్బ
పిండు నొక్కుమ్మడిఁ జెండివైచు
వైచి పెంగూర్మిఁ జొప్పడ నెన్నఁగారాని
పేర్మితో ని న్నిందుఁ బెండ్లియాడు
నాడి నాఁడెపుఁబైఁడియందలంబున నిల్పు
కొని తనపల్లియ కొనర నరుగు
తే. నరిగి రతనంపుమేటియుప్పరిగలోనఁ
జెలువు మీఱినగొజ్జఁగసెజ్జమీఁదఁ
బలుదెఱంగుల వలరాచపనుల నిన్ను
మెఱయఁ గరఁగించు నమ్మువీఁ మెఱుఁగుఁబోఁడి. 104
క. ముద్దులపట్టివి నీకీ
గద్దఱిచందముల మెలఁగఁగా రాదు సుమీ
తద్దయుఁ బెద్దలఁ దలఁపక
ముద్దియ నీ కింత డెందమున వెత యున్నే? 105
ఆ. కొలఁదిలేనివేడుకల మును పెంచిన
యంచచిలుకగముల నలుక మీఱఁ
దొడర నడిచి పాఱఁదోలెద విదియేమి
తప్పు సేసె నిపుడు తలిరుఁబోఁడి. 106
తే. అతివ! యెన్నఁడు మామాట కడుగుదాఁట
కుండుదానవు నేఁడేమి యొండుదెఱఁగు
పూని మాటికి నుసువంగరానికినుక
సేసెదవు నేర మెద్ది మాచెంతఁ జెపుమ. 107
క. ఎలనాఁగరో! నీకోరిక
వలనుగఁ జేకూరె నింతవలవంతయుఁ దా

నిలుచును మాపైఁ బలుమఱు
నలుక కడు న్నిగుడ నెగ్గులాడకు మింకన్. 108

వ. అనిన విని ముద్దియ తద్దయుం బ్రొద్దూరకుండి యన్నెచ్చెలి
పిండునకు వెండియు నిట్లనియె. 109

నీల చెలికత్తెలపై నలిగి మాటలాడుట.

ఉ. మమ్మురమైనబల్వెతల మున్గుచునుండెడుదానిచుట్టును
గ్రమ్మి పడంతులార! కొఱగాములు వేమఱు నెంచ సాగినా
రమ్మకచెల్ల! యల్ల చిగురాకుఁగటారికడిందిజోదుపూ
వమ్ములబారి కోర్వఁ దరమా వెఱమాటలు వేయు నేటికిన్?

క. కడనుండి పెక్కుమాటలు
నుడువంగా వచ్చుఁగాక నూల్కొనియెడుపల్
కడగండ్లఁ బడఁగ వచ్చునె?
విడువక యెవ్వారికయిన వెలఁదుకలారా! 111

క. అకటా! బెడిదపువలపుల
సెకలం బడి ప్రేఁగుదానిఁ జేపట్టఁగనొ
ల్లక యిటువలె నెంతురె ని
ప్పుకలపయిన్నెయి చల్లుపోలిక మీఱన్? 112

తే. వినుఁడు నామాట లిపుడు మీవీనులలర
సైఁపకుండిన నింతియ చాలుఁగాని
యింకనేమియుఁ గొఱగానియొగ్గులాడఁ
బోకుఁడీ మీకు మ్రొక్కెద బోటులార! 113

ఉ. కూరిమిబోటులంచు మిముఁ గొండగ నచ్చుచు నున్నచో
నయో, నేరము లెన్నుచు న్నిగుల నెవ్వగలం గలఁగించి

సారెకుం, గేరెద రింతెకాని మదికిం గడు నెమ్మి దలిర్ప
నేర్పుతోఁ, గోరినకోర్కి మీాఱ సమకూర్పఁగఁ జాలుదురే
యొకింతయున్. 114

ఉ. చక్కఁదనంబు జవ్వనము జాణతనంబు గొనంబు దేజుఁ బెం
పెక్కినయుక్కునుక్‌ సిరియు నిమ్ముగఁ గల్గి చెలంగుచున్న
యా, రక్కసిగొంగపైఁ గడుఁ దిరంబుగ నిల్పినడెంద మింకఁ
దాఁ, డక్కరి నొక్కనిం గనయుట న్నెటఁ గోరునె మాట
లేటికిన్? 115

క. మీామాట సేయదని యిం
కేమియు నుల్లమున నలుక లిడఁబోవక మీా
గీములకుఁ బొందు గొబ్బున
వేమాఱును గేలు మొగిచి వేఁడెద మిమ్మున్. 116

చ. గొనకొని మీాయెదక్ నెఱయఁ గూఱిమి డెందములోనిక స్తి
మం,తనమునఁ దెల్ప నేరుపులె తద్దయుఁ జూపితి నింతె
యందఱుక్, వినియెదునట్లుగా నిఁకను వేమఱు నామున
నవ్వకొంచు నో, యనుఁగువెలందులార! మము నాఱడిఁ
బెట్టకుఁ డమ్మ వేఁడెదన్. 117

వ. అని యిత్తెఱంగున నమ్మెఱుంగుఁబోఁడి బిత్తరించుచుం
గ్రొత్తవలవంతలఁ దత్తఱించుచుఁ బుత్తడిదువ్వలువదాలుపు
పయినత్తినబత్తిం జెలికత్తియలమొత్తంబుల నొత్తియాడుచు
నీడులేనికోర్కుల నువ్విళ్లూరు చుండెనని నిరాబారిసింగంబు
లకు గతయొఱంగించుజడదారి వినిపించినవార లతని నవ్వలి
కతయుఁ దెలుపుమని వేఁడిన. 118

మ. మలసూడగ్గి జనుండు రక్కసుఁడు నీర్తైతాల్పు రాగాడ్పుజ
క్కులతేండ్లున్విసదారితాలుపును బల్కుంబోటిగేస్తుండుఁబు
ల్గులరాడాల్దొరయున్మొదల్గలుగువేల్పుల్గొల్వ నవ్వెండిగు
బ్బలిపైనుండి జగంబులేలుబలువేల్పా! గట్టావిల్దాలుపా! 119

తే. కడలిదొన పాఁపసారియుఁ బుడమి తేరు
గట్టువిల్లును దొలిపల్కుగమిగుఱాలుఁ
బులుఁగుడాల్వేల్పుములికియుఁ బూని కడిమి
మెఱయఁ దిగ ప్రోల్లుగూల్చినమేటివేల్ప. 120

మాలిని.—

కదలనిబలు తేరున్ గాడుపున్ మేయు పేరుం
గుదురగుతల యేఱుం గొండపై మేల్బిడారుం
గొదుకక పలుమాఱుం గోరికల్ గూర్చుతీరుం
బొదలెడిమెయిసౌరుం బూని యొప్పారుమేటీ! 121

గద్యము ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణాసంలబ్ధ
సరసకవితాసామ్రాజ్యధురంధరఘనయశోబంధుర కౌండిన్యస
గోత్రపవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్త్రబుధజన
విధేయ తిమ్మయనామధేయప్రణీతం బైననీలాసుందరీపరి
ణయం బను సచ్చతెనుఁగుఁ బ్రబంధంబునందు ద్వితీయా
శ్వాసము.

---

# తృతీయాశ్వాసము.



క. సిరిపెనిమిటియుం బలుకుల
గరితమగఁడుం బొగడ మెచ్చుగాంచినగట్టుం
దొరముద్దుఁబట్టిడెందపు
విరిదమ్మికొలంకుఁదేటి! వేల్పులమేటీ! 1

వ. విను మన్నిరాబారిరాబారులకుం గత యొఱఁగించుజడదారి
యిట్లని చెప్పందొడంగె నట్లు గొల్లరాకన్నియ వన్నియ
దఱిఁగి యెన్నరానివగలం బొగులు చున్నంత. 2

సాయంకాలవర్ణనము.

తే. బొమ్మ యనుపేరియగసాలె పూఁటచెలిని
గోరి యలరించుటకుఁ జదల్గుదుటఁ గాఁచి
నీటముంచిన మేటివన్నియపసిండి
పూదెయనఁ గ్రుంకుఁగడలిలోఁ బ్రొద్దు ప్రాలె. 3

తే. రేవెలందుకఁ బెండ్లాడ రిక్కఱాయఁ
డేఁగుదేఁగలఁడని వేల్పుటిగురుఁబోండ్ల
గములు గట్టినక్రొత్తచెంగలువతోక
గములనఁగ సంజకెంజాయ లమరె మింట. 4

క. బలితంపుసంజకెంజా
యలు నిద్దపుమావిచిగురులని చేరి తమిం
గలయంగాఁ బర్వినికో
యిలమూఁక లనంగఁ గడల నిరులు దనర్చెన్. 5

క. మరుఁడు దెరువరుల నెల్ల
స్వైరపుఁ దీర్పంగఁ గోరి విరివిగఁ గఱిదే
వరయుడుగున నిడుమల్లియ
విరు లనఁగా రిక్క లెసఁగె వేలుపుఁద్రోవన్. 6

క. తామరలు ముడిఁగె జక్కవ
చామలకు న్వెతలు పర్వెఁ జక్కఁగఁ బడుపుం
గోమలులకు బోజుఁగులకును
నేమం బొనగూడె నపుడు చెప్పఁగ నరుదై. 7

చంద్రికావర్ణనము.

తే. తనర మగమానికపువాలు దాల్పుజోదు
వేడుకలు మీఱ నాడు మేల్తేడమీఁద
గొనబుమీఱెడు నపరంజికుండ యనఁగఁ
దూర్పుగుబ్బలిపైఁ దోఁచెఁ దొగలఱేఁడు. 8

క. మినుఁగోలకునఁ బూచినచ
క్కనిచెందొవ యనఁగఁ దనరెఁ గలువలదొరలోఁ
గననయ్యెఁ గప్పు మది క
త్తినవేడుక నుండుగండుఁజేఁటి యనంగన్. 9

వ. అంతఁ గొఱంత యింత లేక జగం బంతయు నిండి పిండిచల్లిన
తెఱంగునఁ బొంగారుచు దెఱపి లేక తఱపివెన్నెలలు గాయఁ
దొడంగినం గడంగి నింగిముట్టిన సంతసంపుటగ్గలికల డగ్గ
ఱించి యొక్కుమ్మడిఁ బొక్కుచు గ్రక్కున మెక్కియా మెక్కి
యక్కజంపుమక్కువలం జొక్కి చిక్కక చక్కెరవిలుదాల్పు
బవరంబులం దవిలి చెన్నారు వెన్నెలపులుఁగుల మొత్తంబు
లును వెన్నెలపులుఁగుల మొత్తంబుల బిత్తరంపుంబనులకు

మెత్తఁబడి క్రొత్తవగఁ దత్తఱంచుచుం దమతమ వేడ్కకత్తెల
నత్తుకొని పూవుటెత్తులప్రేటులాడుచు విచ్చలవిడిం దిరుగు
బోజుంగులును బోజుంగుల సొక్కడకుం బనిచి వగలం దగిలి
మగలనెదిరించి కొంచక మాచిగందంబు లలఁది వలిపంపుఁ
దెలివలువలు ముసుంగు లిడి దోసంగు లఱి వెసం గదలి
యిక్కలకుం దాఱు చెడిపజవరాండ్రం గని తమజవరాండ్ర
నెవలం దలంచి యొల్లన నుల్లంబులు దల్లడిల్ల నుస్సురని
సొమ్మసిలం బాఱుతెరువరులును దెరువరుల గెలువం దరలు
మరునకుం దఱియనుకమ్మరీఁడు వెరవునం జేసి యునిచిన కఱకు
టమ్ములగుంపుల సొంపునం బెంపాఱు కలువక్రొవ్విరులును
గలువక్రొవ్విరులపయి ముసరి కొసరి తీఁగపసగలపూదేనె
లాని పెల్లుగం ద్రుళ్లు గండుఁదుమ్మెదలును గండుఁదుమ్మెదల
రొదలు చెవుల నాట బీఁటలగు డెందంబులతోడ గాటంపు
మరునాటలకుఁ దివురు కొమరుంబాయంపుందుటారికత్తియ
లును తుటారికత్తియలసిబ్బెంపుగబ్బిగుబ్బల కెన యనం
దగి సొంపు గలిగి వెత లొనర్చు జక్కవపెంటి కూటువలను
జక్కవపెంటి కూటువలపాటు గనుంగొని వెఱచి పొల
యలుకలు మఱచి పఱచి మగల నిఱియం గౌఁగిలించి
కొనుముగుదపూఁబోఁడులును ముగుదపూఁబోఁడులనిద్దంపు
ముద్దుమొగంబులను దొరగానిసిగ్గునంబోలె ముడుంగఁ
బాఱిననెత్తమ్ములును నెత్తమ్ములకొలంకులం దలంకక దుంప
దూండ్లు మెసవి విసువక కూఁత లిడుకొదమరాయంచబారు
లునుం గలిగి పుడమియెల్ల మొల్లం బగుచల్లదనంబున
నుల్లసిల్లుచుండె నప్పు డాగొల్లరాకన్నియ యెన్నరానివల
వంతలఁ బొరలు చుండె నట్టియెడ. 10

### నీలను మన్మథుఁ డేచుట.

క. ఇరువంకలఁ దన్నుఁ జొదవి
గొరవంకలుఁ దుమ్మెదలును గోయిలలుండ
కరిచిలుకలుఁ బురిపులుఁగులు
గొరగొర రా మరుఁడు వెడలెఁ గొమ్మఁ గలంపన్. 11

వ. అట్లు వెడలి. 12

మ. కడిమిం జిల్కపిసాళిజక్కి నెదురెక్కం జివ్వనం దోలి బ
ల్వెడవింట స్సును వాఁడిపూములుకు లోలిం గూర్చి బిట్టార్చి
నెవ్వడిఁ జేకొల్దిగఁ దీసి డాసి మరుఁ డవ్వాల్గంటిచన్దోయి నె
న్నడుచక్కిన్ గుఱిచేసి యేసెసదరంటం గాఁడి మై సోలఁగన్.
చ. తలిరుజిరావజీరుబలుదాడికి నోడి కడంక దక్కియు [యున్
కులుకుమిటారి డెందమునఁ గొందలమందుచు నప్పు డెంత
వలపులవెచ్చ హెచ్చఁ జెలువం బగునమ్మెయిఁగ్రాల సోలుచున్
గళవళపాటుతోఁ జెలిమికత్తెల దూఱుచునుండి వెండియున్.

సీ. తులువరాచిలుకమూఁకలహాళాహళులకుఁ
బాఁపమేపుడుఁబుల్గుబారురొదకు
జమిలిముక్కాలిపిసాళిబల్ మ్రోఁతకుఁ
గొదమకోయిలచాలుగోలగోలలకు
గద్దఱిగొరవంకగములచప్పుడులకుఁ
బొగరుటంచలపల్కువెగటులకును
నలినాలిగాడ్పుబోదలహెచ్చరికలకుఁ
జలివెల్గునుదుటువెన్నెలలసెగకుఁ
తే. వొడరి బడిబడి వెడవింటఁ గుడియెడమల
నడరి వడినేయుకఱివేల్పుఁగొడుకుదుడుకు

టింపజడివానసోనల యలజడికిని
మిగుల నెద నోడి యాఁడు నమ్మించుఁబోఁడి. 15

— మన్మథదూషణము. —

తే. అలరువిలుకాఁడ! బలుసిరి గలిగినట్టి
దొరకొడుకనంచుఁ బొగరునఁ ద్రుళ్లుకొనుచుఁ
దెఱఁగెఱుంగక ముగుదలఁ దెరువరులను
బూని యేతువె నీపూన్కి బుగ్గిగాను. 16

క. పొరపొచ్చెంబునఁ బలుమఱు
విరిఁబోఁడుల నెల్ల మిగుల వెతవెట్టుదు నీ
దొరతనము ద్రుంగిపోవను
మరుఁడా! నీచేతివిల్లు మంటం గలయన్. 17

చ. తలఁపఁగ ముజ్జగంబులకుఁ దల్లియుఁ దండ్రియు నైనలచ్చికిం
బులుఁగుహజాలుమావజీరునకుఁ బుట్టినదిట్టవు నీకు నెల్లరుం
గలయఁగఁ దోడఁబుట్టువులుగారె? యయో! నెనరింతలేక లేఁ
జిలుకలకొల్కులం గలఁపఁ జెల్లునె పెల్లుగఁ బచ్చవిల్తుఁడా!

ఉ. కన్నులవింటివాఁడ! తిగకన్నులదేవరతోడఁ బోరి ము
న్నన్నుమునొంది మేఁ దొఱఁగుపట్టున నెక్కడ డాఁగిపోయెనీ
మన్నెతెకంబు నేఁడు కొఱమాలినకోయిలచిల్కమూఁకలం
బన్నుగఁ గూడి చేడియల బాములఁ బెట్టెదు పోటుబంటవై.

— చంద్రదూషణము. —

చ. బలితపుటాముసం దమియుఁ బర్వగఁ గైకొని యొజ్జముద్దియం
గలసిన దోసకారి వని కాదె నినుం గని తమ్మికొమ్మ ని

చ్ఛలుఁ దలపంచుచుండు? నదిచాలదొ యాఱడి నీకు నెంతకుం
జలువలతేఁడ! నీసవురు సన్నముగా నిఁక నిందు రాకుమీ.

ఆ. కొంకులేనివెతలఁ గుంచెడిముగుదల
డంకతనము మీఱి జంకు లేక
బింకమునఁ గలంచె దింక నెన్నఁడు నీకు
వంక గల్గదోటు జింకతాల్ప? 21

తే. కటకటా! మున్ను ముక్కంటికంటిమంట
చేత బూదైన మరునకుఁ జెల్లుఁగాని
తడవు మనియెద ననుకోర్కి నడరు నీకు
జాడయే చేడియల నేచఁ జందమామ! 22

వసంతాదులదూషణము.

క. చెలువుగలవాఁడ వంచును
జెలువల నలయింప నీకుఁ జెల్లదయో నీ
చెలువెల్లఁ జెట్లపాలుగ
నలరుజిరాజోదుతోఁడ! యామనితేఁడా! 23

క. జత లేనిపూవు గల్గుట
కతివలపైఁ జెల్లు రేఁగి యలజడి మీఱ
న్వెత పెట్టుదువే యిఁక నీ
బ్రతుకు బయల్గాను నాలిపయ్యరకుట్టా! 24

తే. మున్ను కొన్నాళ్లు పలుగాకిమూఁకలోనఁ
గలసి మెలఁగిన తెఱఁగెల్లఁ గానిపింపఁ
జేడియలమీఁద గ్రుడ్డెత్తి సేయరాకు
కోయిలా! యింక నీయిల్లు కూలిపోను. 25

క. నేటుకొని పండ్లు గొఱుకుచుఁ
జీటికిమాటికిని గసరు చిలుకం జిలుకా!
బోటుల నలయించెదు నీ
గోటాపన యెన్నఁ డింక గూఁటం బడునో. 26

తే. తలిరుఁబోఁడులడెందము ల్దల్లడిల్లఁ
గూఁక లిడుకొంచు నెంతయుఁ గొఱఁత లేక
యాగడంబునఁ బురివిచ్చి యాడెదేమి
యక్కటా! నెమ్మి! నీయాట యడవిఁగలయ. 27

క. నెమ్మదిఁ బలుమఱు మొరయుచుఁ
గమ్మనిపూఁదేనె లాని కడుఁ గ్రొవ్వి యహో
గొమ్ములఁ గలఁపగఁ జూచెదు
తుమ్మెద! నీత్రుళ్లు పెద్దతుప్పలఁ బట్టన్. 28

తే. తవిలి పలుమఱుఁ జెవులు చీఁదఱఁ గొనంగ
బిట్టు మొరసెదు వసుత్రాగినట్టు లిట్టి
గట్టివాజాడ లెట్టుగాఁ బట్టువడియె
బెట్టుగా నిన్ను వెసఁ జెఱఁ బెట్టి యిడను. 29

వ. అని మఱియు మఱియుఁ బరికించి చెఱకువిలుకానికఱకు
చుఱుకుటలరుములికి మొత్తంబులకు నంతకంతకు నగ్గలం బగు
వలవంతసెకలఁ గ్రాఁగి వేఁగి సైఁప రాకున్న డిల్లపడి మెల్లన
సొమ్మ సిల్లిన. 30

చెలికత్తెలు నీలకు శైత్యోపచారంబులు సేయుట.

క. చెలు లెల్లఁ దల్లడిల్లుచు
వలగొని దరి నిలిచి యకట వలవంతసెకల్

బలు వయ్యెఁ దలిరుఁబోఁడికి
వలిపను లిఁక సరగఁ జేయవలె నని మఱియున్. 31

ఆ. కప్ర మూఁది మంచిగందంబు మెత్తి ప
న్నీరు చిలికి తూండ్లు నించి వలపు
గ్రమ్ముపూలవిసనకఱ్ఱచే వీచుచుఁ
జివురుసెజ్జమీఁదఁ జేర్చి మఱియు. 32

తే. ఎన్నరానట్టిచలిపను లెన్ని యేనిఁ
జేయ మే లందులను లేక నేఁగిఁ బొందు
చున్నకన్నియ మెల్లన నుస్సు రనుచుఁ
బొరలి యి ట్లని పలికె నబ్బురము మీఱ. 33

సీ. నిద్దంపుఁబొన్నుపై నిప్పులతునియలు
నింపఁ జెల్లునె మీకు నెలఁతలార !
యెడనెడ విసము గ్రక్కెడుపాములనునోడఁ
గూర్పఁ జెల్లునె మీకుఁ గొమ్మలార !
కళపెళనుడుకుచక్కనినూనియల్ మీఁదఁ
జిల్కఁ జెల్లునె మీకుఁ జెలియలార !
మేనఁ బొక్కులు పొక్క మెదియించి సున్నంబు
మెత్తఁ జెల్లునె మీకు మెలఁతలార!

తే. కటకటా! నేఁడు పగ దీఱ నిటులు గలఁప
వలయునే యంచుఁ బలుమఱుఁ గలవరించు
నలరులును దూండ్లుఁ బన్నీరు వలపు గలుగు
చలువసిరిగందమును గాంచి కలువకంటి. 34

ఆ. చానలార! యిపుడు జంటారుమేనులు
దాల్చి మిగుల సెగలఁ దగల నెండ

గాయ సాగె నేమి గాములతోఁ డని
చెలువ మిగుల నలుకఁ దలఁకి పలుకు. 35

### చెలఁతలు మన్మథపూజసేయుట.

ఆ. అట్లు గళవళించు నతివను గనుఁగొని
యనుఁగుఁజెలులు వెఱచి యహాహా! వలపుఁ
గాఁక బలిత మయ్యెఁ గ్రొల్గంటి కిఁక మరుఁ
గొలువకున్న మేలు గూడ దనుచు. 36

సీ. నునుఁగ్రొత్తసిరిగంధమునఁ దిన్నె యొనరించి
చెలువుగొజ్జఁగనీటఁ గలయ నలికి
పలువన్నె లలరఁ గప్రపుముగ్గులను బెట్టి
పసమించు చెఱకుఁగంబములు నిలిపి
పరువంపుమల్లెక్రొవ్విరులపందిరి వ్రేసి
తళుకుగేదఁగిఱేకు దళ్లుగట్టి
తొగలఁ జెంగల్వలఁ దోరణంబులు గట్టి
మేలుముత్యాలజాలీలనుంచి
తే. తమ్మిపూమిద్దెగద్దెపైఁ గమ్మవిల్తు
నిమ్ముగా నిల్పి యొమ్మెను గొమ్మలెల్లఁ
గ్రమ్ముకొని పెక్కులాగుల దొమ్మిగూడి
పూజ లొనరించి యి ట్లని పొగడి రపుడు. 37

తే. మ్రొక్కెదము నీకుఁ జక్కెర లుక్కెఱలును
మెక్కి నిక్కుచు మిక్కిలి చొక్కుతొగరు
ముక్కు బల్పక్కిజక్కిపై నెక్కి జగము
లుక్కు మెఱయంగ గెలుచుచు నుండుజోద. 38

లయ. తుమ్మెదలు నాలిపలితెమ్మెరలుఁ గోయిలల
దిమ్ములును జిల్కలును నెమ్మిగములు న్గా
టమ్ముగఁ బోరింబోరిని గ్రమ్ముకొని గోల్వఁ జెలు
వమ్మున బయల్వెడలి కమ్మనగువింటం
దమ్మివిరిముల్కి బెడిదమ్ముగ నమర్చి వడిఁ
జిమ్మి కడిమిన్నగల నిమ్ముగను ఱొమ్ముల్
గ్రమ్మి కరఁగించుచును గొమ్మలనుగూర్చు నిను
నెమ్మదిని గొల్తుము తిరమ్మయినబత్తిన్. 39

క. వలరాయఁడ! నీ బెడిదపు
టలరుందూపులకు వెఱతు రఁట నల్వయుఁ గ్రో
న్నెలతాల్పును నిఁకఁ బెఱవా
రలఁ గలఁచుట యేమి యబ్బురం బరయంగన్? 40

క. గోలపయి న్వాలారుం
గోలలఁ బరఁగించి మరులు గొల్పుచు మిగులం
దూలించుట కిఁకఁ దాళం
జాలము నీయాన యో మొసలిడాల్వేల్పా. 41

క అని యనుఁగు లెల్ల నిత్తెఱఁ
గున వెడవిల్కాని వేఁడుకొన నపుడా క్రో
న్ననఁబోఁడి కొంత డెందం
బున వెత చల్లారఁ దాల్మి పొరయుచు నుండెన్. 42

వ. అంత. 43

### ప్రభాతవర్ణనము.

చ. పులుఁగులు గూసె జక్కవలు పొందుగ డాసె బొజుంగు
మూఁకకుం, బొలుపులు వాసె రిక్కగమి పోఁడిమి మాసెఁ

బిసాళితుమ్మెదల్, గొలఁకుల మ్రోసెఁ జీఁకటులు గొబ్బున
మాసె హారుండు తుంటవిల్, బలువడి నెక్కుఁ దీసెఁ దొగ
పైదలియుం గను మూసె నెంతయున్. 44

ఆ. ఇరులగొంగ తమ్మివిరిఁబోఁడివగ కాఁడు
చదలుమానికంబు జగముకన్ను
వేఁడివేలు పివము వేఁటాడుపోటరి
ప్రొద్దు తూర్పుమలను బొడమె నపుడు. 45

తే. తెల్లవాఱుట గన్గొని యెల్లవారు
గొల్లవారింట వేడ్కఁ గన్గొనఁగ వలయు
నంచు మేల్కాంచి తఱిచెయ్వు లన్ని దీర్చి
గీము లలరించుకొనిరి కోర్కియుఁ జెలంగ. 46

గొల్లదొర తనపట్టుల నలంకరింప నియోగించుట.

ఆ. అపుడు గొల్లనాయఁ డందంబుగాఁ దన
నట్టు లలరఁజేయునట్టుగాను
నేర్పు గల్గువారి నేర్పరించినఁ జాల
నెలమితోడ వార లెల్లఁ గడఁగి. 47

సీ. తెలిముత్తియపుఁబందిరుల నెల్లెడల నిల్పి
నలువొప్పఁ దొగదోరణములు గట్టి
ముంగిళ్లఁ గపురంపుముగ్గు లిమ్ముగఁ బెట్టి
తనరుగోడలను జిత్తరువు దిద్ది
పసిఁడితిన్నియల సొంపెసఁగఁ గస్తురి యల్కి
క్రంతలఁ బన్నీరు గలయఁ జల్లి
పట్టుఁబుట్టముల మేల్కట్టు లమర్చి తీ
విని బయళులను గొల్లెనలు వన్ని

తే. మఱియు దరి లేనిసొగసు లేమఱక చేసి
పలుదెఱంగులవాయిదమ్ములు సెలంగ
నిగురుఁబోఁడులు మగవాండ్రు నీడులేక
యరిది సింగారములుపూని యలరి రంత. 48

కుంభకునిపురికి గొల్లలు వచ్చుట.

సీ. కిర్రుచెప్పులు గొప్పగిఱునామంబులు
మొలచెక్కుకత్తులు నిలువుసిగలు
కుడిముక్కుగ్రమ్ములు గురివెంద పేరులు
పిల్లగ్రోవులు మేటివల్లెత్రాళ్లు
లొరుగట్టుపంచెలు బెరసుఁబచ్చడములు
గార్కొన్నలోవంక కఱియొడళ్లు
గుండప్రోగులు చిప్పగొడ్డండ్లు సెలగోల
లొప్పారుపలువంకయుంగరములు
తే. గలిగి గాటంబుగా నెల్లకడలనుండి
పెల్లుమీఱంగ గిబ్బల పీఁచ మడఁచి
కోర్కు లిగురొత్తఁ గన్నెఁ జేకొనెదమంచు
మొల్లముగఁ జేరి రచటికి గొల్ల లెల్ల. 49

వ. అట్లు చేరినవారి కెల్ల గొల్లదొర యుల్లంబులు దనియ నోగిరంబులు వేగిరంబునం బెట్టించి వీడెంబులు గందంబులుఁ గోకలుం దొడవులు నిడి విడిదిపట్టుల నునిచె నంతకుమున్న పనిచినమానిసివలన నత్తెఱంగంతయు విని నందుండు యశోదయుఁ దాటకిసిడంబుజోదను బుత్తడిదువ్వాలువదాల్పును బయనం బయి కదలి ప్రోల్కడచక్కి న్వచ్చుచుండి రయ్యెడ.

నందాదులు కృష్ణునితో వచ్చుట.

తే. వీటఁ గల్గిననాఁడెంపుబోటు లెల్లఁ
గూటువలు గూడి జన్నంపుగూటిదొరల
మాటకయి మేనుపూనిన మేటివేల్పుఁ
దేటగాఁ జూచుకోర్కి నచ్చోటఁ జేరి. 51

సీ. వీఁడెపో యేప్రొద్దు వ్రేపల్లెలో గొల్ల
మగువల వలపించు సొగసుకాఁడు
వీఁడెపో చెలరేఁగి విసపుఁబాలిడుటాఁగ
రక్కసిఁ దునిమిన యుక్కుఁదునియ
వీఁడెపో నందునివిరిఁబోఁడిముందర
మొనసి చిందులుత్రొక్కుముద్దులాఁడు
వీఁడెపో బండితోల్వ్రేలుపు నుంకించి
పిండిగాఁ దన్నినదండిజోదు
తే. వీఁడెపో వ్రేలగీముల వెన్నజున్ను
గములఁ గొల్లగ మెక్కినగండిదొంగ
యనుచు నుడువుచుఁ దెలిము త్తియంపు సేసఁ
బ్రాలు చల్లిరి వేడుక ల్బయలువడఁగ. 52

తే. అపుడు కుంభకుఁ డెదురుగా నరుగుదెంచి
యక్కకును బావకును మ్రొక్కి తక్కువారిఁ
గౌఁగిటను గూర్చి వేడుక ల్గడలుకొనఁగఁ
దనమనికిపట్టునకుఁ దోడుకొనుచు నేఁగి 53

క. అందఱకును బోనమ్ములు
గందమ్ములుఁ దమ్ములములుఁ గడువడి నిడి తా

సందంబుగ డెందంబున
ముం దెన్నఁడు లేనియెలమి మురియుచు నుండెన్. 54

కృష్ణునిరాక నెఱిఁగి యాఁబోతులు విజృంభించుట.

సీ. ఆరేయి కల్లరియాలపోతులు పైఁడి
వలువదా ల్పచటికి వచ్చు టెఱిఁగి
కినుకతోఁ రెచ్చి దొడ్డిని గల్లుచూడ్వాఁడి
మొదవుల లేఁగలఁ బొదివి చాలఁ
గొమ్ములఁ గ్రుమ్మి లేఁ గోడెల నెడ్లను
దలుపుల నెత్తును నెఱయఁ బొడిచి
గోడలు గ్రోడాడి కోవెలల్ నుగ్గాడి
పందిళ్లు పడఁద్రోచి బండ్లు విఱిచి
తే. తలుపులు పగిల్చి గుడిసెలు దళ్లుఁ గూల్చి
గొల్లవాడల నెల్ల గగ్గోలు పుట్ట
నాఁడువాండ్రను గుఱ్ఱల నంతమందిఁ
గడఁగి తఱుముచు నెసలేని కడిమిఁ జూపె. 55

వ. అంతఁ దెల్లవాఱుటయు నయ్యేలుతోఁ డెల్లగొల్లకొమరులఁ బిలిపించి తనముద్దుఁబట్టిని దద్దయు సింగారించి తెచ్చి ముందర నునిచి యందఱు విన నిట్లనియె. 56

కోడెలఁ బట్టువానికి నీల నిచ్చెద నని గొల్లలతోఁ గుంభకుఁడు చెప్పుట.

ఆ. గొల్లలార! చెడుగుఁగోడెలఁ గంటిరె
జగము లెల్ల మ్రింగఁ జాలుకడిమి
నెసఁగుచున్న వెన్న నివి బొబ్బమెకములో
పులులొ యడవియేనుఁగులొ నిజంబు. 57

ఆ. వీనివలనఁ జాల వెతఁ గుందితిమి నేల
తేఁడు కినుక చేసి వేఁడి సూపె
నింకఁ బెక్కుమాట లేటికి వినుఁ డిదె
నిక్క మైనదిట్ట లొక్కపలుకు. 58

క. బలిమి దలిర్పఁగ నీగి
బ్బలఁ బట్టఁగఁ జాలునేనుపరి కిపు డిత్తుం
జెలువముల ప్రోక యగునీ
తలిరాకుంబోఁడి నెమ్మి దళుకొత్తంగన్. 59

క. అనిన విని గొల్లకొమరులు
ననఁబోఁడులమిన్నఁ గైకొనఁగ వలసినబి
ల్పును గోడెల గెలువఁగ నో
పనిజడుపును గల్గి కాడుపడి యుండి రొగిన్. 60

ఘోషవంతుఁడు కోడెలచేఁ జిమ్మఁబడి సొమ్మసిల్లుట.

వ. ఆయెడ ఘోషవంతుం డనునొక్కగొల్లకొమరుండు. 61

క. గిబ్బల గెల్చుట యిది యొక
యబ్బురమా! యనుచు బింక మాడుచు నపుడే
గొబ్బున లేచి బుజంబులు
దబ్బునఁ జఱచుకొని బల్లిదపుదిట మెసఁగన్. 62

తే. తొడరి యమ్మేటిమాలపోతులను డాసి
పట్టుకొనఁబోవుటయు నవి బిట్టు గినిసి
కన్నులను నిప్పు లొలుకంగఁ గడఁగి వానిఁ
బొడిచె నన్నియుఁ జూపఱు బెదరి పఱువ. 63

క. అటువలెఁ బొడివిచఁ గనుఁగొని
దిట మింతయు విడక యతఁడు దీటుగఁ గడుముం

దటికిఁ జని యొక్క_పోతును
దటుకునఁ బిడికిటను బొడిచెఁ దలనదుచక్కన్. 64

క. పొడిచిన నన్నియు నొక్క_
మ్మడిఁ గడిమి దలిర్ప నతని మార్కొని కిసుక
న్నిడుద మొనవాఁడికొమ్ములఁ
బుడమిం బడ వైచి పొడిచి పొరిఁబొరి మట్టెన్. 65

ఆ. మట్టి మిగుల నలుక రెట్టింప దప్పిగాఁ
జిమ్ముటయును దూలి సొమ్మసిల్లి
పడియె నతఁడు గిబ్బపదు వంత గొల్లల
పైకి నుఱికె కడిమి బలిమిరాయ. 66

ఉ. కొందఱఁ బూని కొమ్ములను గ్రుమ్ముచుఁ గొందఱ మ్రగ్గఁ
ద్రొక్కుచుం, గొందఱఁ బెందొడల్ విఱిగి కోయని యా
ర్వఁగఁ గాలఁ దన్నుచుం, గొందఱ నేపుతోఁ దఱిమి గుట్టల
మెట్టలపా లొనర్చుచుం, జిందఱవంద త్రై పఱవఁ జేయుచు
గాటపులావుఁ జూపుచున్. 67

కృష్ణుఁడు బలరామునితో నక్కొడెలకతఁ దెల్పుట.

క. అప్పగిదిఁ బఱచువారలఁ
దప్పక చూచుచును మోముఁదమ్మిని జిఱున
వ్వొప్పార నపుడు వెన్నుఁడు
కప్పంబుట్టంబువానిఁ గని యిట్లనియెన్. 68

తే ఆలపోతులు గా వివి కాలనేమి
కొడుకు లేద్వ్రరుఁ దనచేత మడిసి తొంటి
సూడుఁ దీర్పఁగఁ బూని యిచ్చోటఁ బుట్టి
రిపుడు వీరి నడంచెద నేపుసూపి. 69

క. పగతుర నడఁచుటయుఁ బం
దుగులం గాపాడుటయును దోరం బరయం
దిగకంటికైన నిది కడుఁ
దగిలినమే ల్గాదె యిపు డెదం బరికింపన్? 70

—కృష్ణుఁడు కోడెలఁ బైకొని చంపుట.—

క. అని పలికి వాని కెదురుగఁ
జనియె నపుడ వేలుపులును జడదారులు నిం
గి నిలిచి కనుఁగొనుచుండం
దన కెంతయు మేలు గోరి తద్దయుఁ బొగడన్. 71

క. చని యటఁ బసరపురక్కసు
లను బయికొని దోసకారులారా! కడుఁ గ్రొ
వ్వునఁ గలఁచితి రిన్నాళ్లును
బనివడి జగమెల్ల నింకఁ బఱవక నిలుఁడీ. 72

క. కల్లరులై పెల్లొదవఁగఁ
బొల్లగఁ గొల్లలను బాఱఁ బొడుచుట గా దిం
కెల్ల తెఱంగుల మిమ్ముం
జెల్లించెద వేల్పుగములు చెలఁగుచు నుండన్. 73

వ. అని యదలించి పలికిన నులికి యలుక రెట్టింప నద్దబ్బఱగిబ్బ
రక్కసు లేడ్వురునుం దొంటియొంటమి మేటిపెనంకువం
జెంగున నెగసి యుక్కున నొక్కుమ్మడి నతనిం దాఁకిన నబ్బ
లుమగండు గండుమీఱి లేగున్న యేనుఁగులపయి దాఁటు
సింగంబు తెఱంగునం గదిసి యఱచేత మోఁపులు చఱచియుం
దఱిమి యురవడిఁగొమ్ముల మెడల నులిమియుఁ దొడలు విఱి

చియు నడుము లవియం బిడికిళ్లం బొడిచియు వీఁపులు
మూఁపురంబులు నడచియు నెత్తురులు జొత్తిల్లం జేసియు
మఱియుం బెక్కులాగుల నొప్పించియుఁ జూపఱచూడ్కికి
వేడ్కగాఁ గొంతదడవు గడపి యంత. 74

క. పిడుగున కెన యనఁ దగుతన
పిడికిట నొక్కొక్కదాని బెడిదంబుగ నె
న్నడినెత్తు లవియఁ బొడిచిన
వడి నొక్కొక్కటియు నేల వ్రాలెం గోడెల్. 75

తే. అట్టు లొక్కొక్క పోటున నాలపోతు
లన్నియును వాత ముక్కునఁ గన్నుఁగవల
నెత్తురులు గార నీలిగి నేలఁ బడిన
నెల్లవారలు వెఱఁగంది రుల్లములను. 76

దేవాదులు మెచ్చి తత్సూచనల నెఱపుట.

సీ. అత్తఱి వేలుపు లాకసంబున నుండి
వెన్నునిపయిఁ జాల విరులవాన
గురియింప నచ్చర ల్గొమరొప్ప నాడిరి
గొల్లతేండ్లందఱు నుల్లసిలిరి
నందుండు గొమరునిఁ బొందుగాఁ గౌఁగిటఁ
బెనఁచి తద్దయును దీవన లొసంగె
గుంభకుండును దనకోరిక యీడేఱె
నని చూచి సంతసంబునఁ జెలంగె

తే. నీలయును జాల ప్రేతలమేలువాఁడు
తనకు మగఁడయ్యె ననుచు డెందమున నుబ్బె

మఱియుఁ జూపఱులెల్ల వేమఱును మెచ్చి
పొగడుచుండిరి వెన్నునిమగతనంబు. 77

నీలకుఁ గృష్ణునకుఁ బెండ్లి వర్తిల్లుట.

ఆ. అంత గొల్లపెద్దలందఱు నీలకు
వెన్నునకును బెండ్లి వెస నొనర్ప
వలయునంచుఁ బూని వలనొప్ప మూరుత
మొజ్జబాఁపనయ్యనొయ్య నడిగి. 78

ఆ. కాళ్ల గోళ్లు దీసి కన్నియకును బెండ్లి
కొమరునకును దలలఁ జమురు రాచి
నలుఁగు లిడఁగఁజేసి నలువొప్ప నయిరేని
నీరువోసి రపుడు పేరఁటాండ్రు. 79

క. తొగసూడు గ్రుంకె దట్టం
బుగఁ జీఁకటు లొదవె రిక్కమొత్తము పొడమెఁ
లగనమును డాసె నియ్యెడఁ
దగఁ బెద్దలు నైదువలును దద్దయు నెలమిన్. 80

తే. పలుతెఱంగులవాయిదంబులు సెలంగ
శీవితో నల్గడల దివ్వటీ ల్వెలుంగఁ
గన్నియను బెండ్లికొమరునిఁ గడఁగఁ బెండ్లి
తిన్నెమీఁదికి మెల్లనఁ దెచ్చి నిలిపి. 81

తే. పుడమివేల్పులు దొలిపల్కునుడువులెలమిఁ
జదువుకొంచును దీవనల్ చాలనొసఁగి
సేసఁబ్రాల్ చల్ల వలిపంపుఁజీర యొకటి
చెలఁగి తెరవట్టి కాల్ద్రొక్కఁజేసిరపుడు. 82

ఆ. చాల వేడ్కలొదవఁ గేలుఁదమ్ముల నంటి
మైదువలు కడంక నంది యిడఁగ
నెన్న రానికూర్మిఁ గన్నియయఱుతను
గట్టుతాల్పు తాలిబొట్టుఁ గట్టె. 83

క. వెన్నునితలపైఁ గన్నియ
కన్నియతలమీఁదఁ జొట్టుఁ గైదువుజోదుల్
సన్నపుముత్తెము లెలమిని
మిన్నక చేదోండ్ల నించి మించిరి మిగులన్. 84

క. చీరచెఱంగులు ముడి యిడి
కూరిమిఁ జిటికెనలు పట్టికొనఁ గూరిచి తా
రావంజోతిని గడు నిం
పారఁగ మ్రొక్కించి రప్పు డాలిన్ మగనిన్. 85

కృష్ణాదులకుఁ గుంభకుఁడు కట్నంబు లొసంగుట.

సీ. అయ్యెడ గొల్లఱేఁ డల్లున కెలమితో
ముత్తెంపుఁజొక్కట్లు మురువు లుంగ
రములు నేవడములు రతనంపుఁబావలు
గొలుసులు పదకముల్ జిలుఁగుఁజేల
లందలా లడపంబు లపరంజిగిండులు
జాలవల్లికలును జంపువాలుఁ
బట్టెమంచంబును బఱపును బాలీసుఁ
జందుగుపెట్టెలు మందసములు
తే. గద్దెపీఁటలుఁ గపురంబుఁ గస్తురియును
బోఁడిమొదవులు మేలైన బఱ్ఱెయలును

నూడిగీలును వరవుళ్లు నాఁడె మైన
మంచిగందంపుఁదుక్కలు మించ నొసఁగి. 86

తే. కూరిమిని వీరకానికి వీరకత్తి
యకును దోలువేల్పుగొంగయన్నకును మఱియుఁ
జుట్టములకెల్ల దొడవులుఁ బుట్టములను
గట్నము లొసంగెఁ గట్టలుగాఁగ నపుడు. 87

తే. జన్నిగట్లకు బట్లకు నెన్నరాని
పైఁడికట్నంబు లొసఁగి కిబ్బంపుఁగూరు
పరులకును గాఁణలకుఁ బెద్దబాఁపలకును
లెక్కసేయక చీరలు రొక్కమిడియె. 88

నీలాకృష్ణుల నొక్కటి సేయుట.

వ ఇత్తెఱంగున నెల్లవారలు నలరునట్లుగాఁ బెండ్లి యొనర్చి
యంత నొక్క మంచిమూరుతమున నాల్కగల నొక్కటి
సేయఁ దలంచి ప్రోడ లగునైదువరాండ్రఁ బనిగొల్పవారు
నయ్యెడ. 89

సీ. పగడంపుసకినలపట్టెమంచము దోమ
తెర విరవాది క్రొవ్విరులపాన్పు
సురమాలిబాలీసుసూతినిగవుసెన
జరబాజుచందువాసాన పీఁట
కపురంపుబరణి చిల్కలదివ్వెకంబంబు
నిల్వుటద్దంబు పన్నీటి క్రోవి
జవ్వాదిపక్కణీజాలవల్లిక పైఁడి
వీణె దువ్వెన వట్టివేళ్లసురఁటి

తే. తమ్మపడిగము మంచిగందంపుఁగోర
పచ్చకస్తురి పెట్టె సంపంగెనూనె
గిండులను గల్గి కన్నులపండువైన
పచ్చరాకట్టుగోనబుటుప్పరిగలోన. 90

ఆ. పెండ్లికొడుకు నిలిపి బిఱబిఱం గన్నెకు
సొగసు దిద్ది వేడ్క లిగురులొత్తఁ
బడకయింటికడకుఁ బరుగునఁ దోడ్కొని
చనుచుఁ బల్కిరపుడు సకియలెల్ల. 91

తే. చెలియ! మును నీవు గోరినచెలువుఁ డిప్పు
డించువిల్కానిపని కెప్పుడెప్పుడంచుఁ
దివురుచున్నాఁడు పడకింటఁ దవిలి తమిని
బ్రొద్దు జరుపకు మిఁకఁ జాల ముద్దరాల ! 92

క. అగ్గలపువలపునను మును
బెగ్గడిలుచు నుండి యిపుడు పెనిమిటితోడన్
డగ్గఱఁ బోయినయప్పుడు
సిగ్గేటికిఁ బోడమెనమ్మ చిత్తరుబొమ్మా! 93

సీ. ముగుద! రమ్మని డాయ మగఁడు చీరినయప్డు
కదియక మూర్కలంగెదవు సుమ్ము
వగకాఁడు మొరకొంగు దిగిచి సెజ్జకుఁ దార్ప
పడిగొట్టి వెనుకకుఁ జనెదు సుమ్ము
వెన్నుఁడు కపురంపువిడియం బొసంగిన
నొదిఁగి కైకొనక యుండెదవు సుమ్ము
చెలువుండు పయ్యెదఁ దొలఁగింప గమకింపఁ
గేలు మాటిడి పెనంగెదవు సుమ్ము

తే. సొగసుకాఁ డెదఁ గదియించి జుంటిమోవి
గంటిరొయొనరించి యిక్కువలంటి తుంట
వింటిబలుదంటపనులు గావించినపుడు
కడఁగి మెలఁగంగవలెఁ జుమ్ము కలువకంటి! 94

క. డేగ తెలుంగున బిఱబిఱ
సాగవలదె చెలియ వలపు సడిలేని దహా!
బాగాయెఁ గాఁపురం బిటు
జా గేటికిఁ బొదగదమ్మ చక్కెరబొమ్మా! 95

సీ. తడవయ్యె బిఱబిఱ నడవరాదె యటన్నఁ
జెలిమీఁదఁ గన్నెఱ్ఱ చేసెదేమి?
నెనరొప్పఁ జెంగట నిలిచి వీడినకొప్పు
దిద్దుక్రొన్ననఁబోఁడిఁ దిట్టెదేమి?
పడఁకతో వెలియాకుమడుపులెమ్మెను జేతి
కొసఁగెడితొయ్యలిఁ గసరెదేమి?
నగుచు గందముదెచ్చి మగనికలందు మ
న్నను బండ్లు గొఱుకుచుఁ గినిసెదేమి?

తే. వాలుగంటిరో! యిటువంటివారెకారె
చొక్కి పెనిమిటికౌఁగిట దక్కి పెనఁగి
పెక్కుదెఱఁగుల రాచిల్కజక్కిజోడు
పనుల గడిదేఱి ప్రోడలై తనరువారు. 96

క. ఓకలువకంటి! మును మనుఁ
బైకొని బతిమాలి మగనిపజ్జ కిపుడు దే
రాకుండెదు సిరి నచ్చిన
మోఁకా లడ్డం బిడియెదు మురువు దలిర్పన్. 97

ఆ. అనుచుఁ బలికి కలికి నర్మిలిఁ దోడ్కొని
పడకయింటి కరిగి పడఁతు లపుడు
ముగుదచేతి విడెము మగనికి మగనిచే
విడెము ముద్దుఁజెలికి నిడఁగఁ జేసి. 98

క. చెలువుగ నీ కిపు డబ్బె
న్నలువుగ నీతళ్కుఁగుందనపుబొమ్మ యిఁకం
దలఁపునఁ గలిగిన తెఱఁగున
మెలఁగుఁడు వలపులు తలిర్ప మెలఁతయు నీవున్. 99

ఆ. గోల గాని మిగుల గాళకురాలు గా
దింతి నీకుఁ దక్కె నంత వేగి
రంపుఁబనులవలని రాయిడి వెట్టక
ముద్దుగుమ్మ నెమ్మి దిద్దుకొమ్మ. 100

తే. చెప్పవలసినలాగునఁ జెప్పినార
మింతె కా కిపు డెన్న మీ కిరువురకును
గలుగుకూర్ములు గనుఁగొన్నఁ దెలిపినట్లు
మెలఁగుదురె యంచు నగుచు నమ్మెలఁత లరుగ. 101

క. వెన్నుఁడు చిఱునవ్వునఁ దగఁ
గన్నియఁ జేపట్టి వలపు గ్రమ్మగ సొగసుం
గ్రొన్ననసెజ్జకుఁ దారిచి
వన్నియ దిద్దుచును మిగుల వలపు దలిర్పన్. 102

సీ. తెలిముత్తియపుసరుల్ దిద్దునెపంబున
గిబ్బచన్బ్బొగడలఁ గేలఁ జెనకి
చెవులకమ్మలు చక్కఁ జేయుజాడల ముద్దు
చిప్పిల నిద్దంపుఁ జెక్కు లంటి
మొలనూలు సవరించు వలనుగఁ గన్పట్టి
వలుఁదపిఱుందుఁ బొక్కిలియు నిమిరి
కపురంపువిడె మొసంగఁగఁ బోవులాగున
మొనసి చక్కెరమోవి ముద్దులాడి
తే పువ్వుబెత్తులు దుఱిమెడి పోలువెలర్పఁ
గప్పు మీఱినబలితంపుఁ గొప్పు ముట్టి
మెల్ల మెల్లనె యొక్కింత మెలఁగ డెంద
మించువిలుదాల్పు చెయ్వుల కియ్యకొల్పి. 103

చ. కులుకుచుఁ దద్దయున్మదిని గూర్మి తలిర్పఁగ ముద్దుచిల్కచుం
బలుక వదేమి? యెమ్మెయుని బాగుగ గంద మలంద వేమి? కో
ర్కులు వెలయంగఁ గౌఁగిటను గూర్ప వదేమి? చలంబొ
నానయో, చిలుకలకొల్కి! యి ట్టరవు సేయఁగ నే నొక
లాఁతివాఁడనే? 104

ఆ. పిన్ననాఁటనుండి పెనఁగుచు నాపయిం
గన్నె నీకు వలపు గలదు కదవె
చేరి వేఁడుకొనినఁ జిక్కులు పెట్టెదు
తాళరాదె యింకఁ దలిరుఁబోఁడి! 105

సీ. పరువంపుమారేఁటిపంపు లెచ్చుటఁ గన్నఁ
జెలి! నీదుకులుకుగుబ్బలె తలంచి
డంబారునెమ్మిపించెంబు లెచ్చుటఁ గన్న
ననబోఁడి! నీదువేనలియె తలఁచి
తిరమొందఁ దేనియపెర లెచ్చుటను గన్నఁ
దెఱవ! నీతొఁగరువాతెఱయ తలఁచి
బెదరి పాఱెడులేటికదుపు లెచ్చుటఁ గన్నఁ
గలికి! నీసొగసుఁగన్గవయె తలఁచి
తే. నిచ్చునిచ్చలుఁ గానలోఁ జొచ్చి మిగుల
నెచ్చరికల మెలంగుచు నిచ్చలోనఁ
గలఁగుచుండెద నెనలేని వలపు మీఱ
నింతి యిఁక జాగువలదు నన్నేలుకొనుము. 106

వ. అని నేర్పు దలిర్పం బలికి. 107

చ. జిలుఁగుఁబయంట మూఁడ్చి నునుఁజన్ను టొయారపుఁజన్ను
దోయిపైఁ, గలప మలంది వాల్చెళుకుఁగన్నులు మూసిన
నవ్వొకొంచుఁ బో, క్కిలి వలకేల సంటి గిలిగింతలు గొల్పుచు
మోవి యానుచుం, గలికిఁ గరంగఁజేసి బిగికౌఁగిటఁ జేర్చెను
వెన్నుఁ డత్తఱిన్. 108

తే. మఱియు వెఱగొప్పు చెలువంపు దెఱఁగుపనులఁ
గరఁగఁ జేయుచు నమ్ముద్దుఁగలువకంటిఁ
గలసి యొనలేని నెమ్మదిఁ జెలఁగుచుండి
గుడుసువాల్దాల్పు రేయెల్లఁ గడపి యంత. 109

నందాదిసహితుఁ డై కృష్ణుఁడు నీలతోఁ దనపల్లె చేరి సుఖించుట.

తే. అ త్తమామలయానతి యంది తోడఁ
దల్లిదండ్రులు నన్నయుఁ దవిలి రాఁగఁ
గుందనపుటందలములోనఁ గొమ్మ నిలిపి
యుల్లమునఁ బొంగుచును దనపల్లె కరిగె. 110

క. అరిగి తననగరిలోనికి
సరగునఁ జొత్తెంచి యపుడు సంగడికాండ్రం
బెరిమె గలపెద్దలను గని
యిరవుగ మన్నించి చాల నెమ్మెదలిర్పన్. 111

ఆ. అంత నీలఁ గూడి యింతంత యనరాని
సంతసంబు మీఱ జగము లెల్లఁ
బ్రోచుకొనుచు నెపుడుఁ బులుఁగుడాల్వేలుపు
తలఁకులేని సిటులఁ దనరుచుండె. 112

వ. అని నిరాబారిసింగంబులకెల్లఁ గత యెఱింగించిన వారలు
కొలందిలేనివేడుకలం దనరు చుండిరి. 113

ఉ. రిక్కలు మంచు నద్దమును రేవొరయుం గపురంబుఁ బాలు
నుం, జక్కెరరాచపు ల్చిలువసామియుఁ జిందముఁ దూఁడు
మేపుడుం, బక్కిగముల్ జగా నలువపట్టియు బొబ్బమెకంబు
వేల్పురా, జక్కియు నీడువాలినయసంబునఁ బాటిలు మేటి
దయ్యమా! 114

క. పుత్తడిమలవిలుకాఁడా!
గిత్తహుమా నెక్కి హాయలఁ గెరెదు తేఁడా!

మ త్తిల్లుమి త్తిసూఁడా!
బ త్తిమిగులఁ గలుగువారి పాలిటివాఁడా! 115

తరళము—

చిలువపేరులు బొమ్మునం దలఁ
జిన్ని క్రొన్నెలపువ్వునున్
మొలను బెబ్బులితోలుఁ గేలను
ముద్దుగుల్కెడి జింకయున్
నలువయాదలపున్కపళ్లెము
నల్లగుత్తుకయు న్మెయి
న్వెలపును న్వెలిబూదిపూఁతయు
వావిరిం గలవేలుపా! 116

గద్యము. ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధ సరసకవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్త్ర బుధజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతం బైన నీలాసుందరీపరిణయంబను నచ్చతెనుఁగుఁగబ్బంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1939.

# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము, తిమ్మకవిప్రణీతము, శుద్ధప్రతి | 1 | 4 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| అప్పకవీయము, శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారివిమర్శతో నున్నది | 2 | 8 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁదచక్కఁగ మరల ముద్రించినారము | 4 | 0 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది. | 5 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి, 2 సంపుటములు ... | 7 | 8 |
| డిటో 3 సంపుటములు ... | 8 | 4 |
| శ్రీమదాంధ్రభారతము, పద్యకావ్యము:— | | |
| 7 సంపుటముల ప్రతి ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి ... | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ,, ... | 2 | 0 |
| శాంతిపర్వము ,, ... | 2 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 5 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| యుద్ధపంచకము, స్త్రీపర్వముగల సంపుటము | ... | 3 | 12 |
| శాంతిసప్తకము | ... | 3 | 12 |
| ఆదిపర్వము మాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విపులమైన పీఠికతో | ... | 0 | 4 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, | | | |
| సాంబనిఘంటువు—టీకానుక్రమణికాసహితము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | ... | 0 | 2 |
| డిటో టీకానుక్రమణికాసహితము | ... | 0 | 6 |
| ఆంధ్రదశరూపకము, మల్లాది సూర్యనారాయణశాస్త్రి | ... | 0 | 8 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, గిల్టుబైండు | | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | ... | 1 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవివిరచితము | ... | 0 | 6 |
| కవికర్ణరసాయనము (మాంధాతృచరిత్ర) | ... | 1 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు | ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనికూర్పు | ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | ... | 0 | 4 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, (భాగవతములోనిది) సటీక | ... | 0 | 6 |
| గయోపాఖ్యానము, రామనామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు | | | |
| సరియైనతర్జుమా, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | | 7 | 8 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో ద్వితీయభాగము, సాధారణప్రతి | ... | 1 | 6 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనకృతము, కాలికోబైండు | | 1 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము | ... | 1 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| దశకుమారచరిత్రము, కేతనకవికృతము ... | 1 | 8 |
| దశావతారచరిత్ర, చక్కనికూర్పు ... | 2 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) ... | 0 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక, (ఆంధ్రభారతములోనిది) ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురిరాఘవాచార్యప్రణీతము, కాలికో | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనామాత్యప్రణీతము ... | 1 | 0 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడ, క్రొత్తకూర్పు ... | 1 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన ... | 0 | 10 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |
| డిటో వేంకటనాథరాజకవివరకృతము ... | 1 | 4 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| డిటో విద్వాన్, దూసి రామమూర్తిశాస్త్రివిరచిత సురభివ్యాఖ్యానసహితము ... | 3 | 0 |
| బసవపురాణము, పిడుపర్తి సోమనాథప్రణీతము ... | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము, శ్రీధరమల్లె వేంకటరామకవి ... | 1 | 0 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు ... | 4 | 0 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము ... | 1 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారివ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రితము ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| మొల్లరామాయణము, ఆతుకూరిమొల్ల ... | 0 | 10 |
| యయాతిచరిత్ర, పొన్నిగంటి తెలగనార్యప్రణీతము ... | 0 | 10 |
| రసికజనమనోభిరామము, కూచిమంచి తిమ్మకవి ... | 0 | 12 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు ... | 2 | 8 |
| రంగరాయచరిత్రము, దిట్టకవి నారాయణకవిప్రణీతము ... | 0 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, ద్వ్యర్థిప్రబంధరాజము ... | 2 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| రామరాజీయము, (నరపతివిజయము) వెంకయ్యప్రణీతము ... | 0 | 12 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు రామభద్రకవి ... | 1 | 4 |
| రుక్మిణీకల్యాణము, టీకాతాత్పర్యసహితము, చక్కనిప్రతి (భాగవతములోనిది) ... | 0 | 6 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి, కూచిమంచి తిమ్మకవి ... | 0 | 8 |
| రుక్మాంగదచరిత్ర (ఏకాదశీమాహాత్మ్యము), ప్రౌఢకవి మల్లన | 0 | 10 |
| లంకావిజయము. (రావణదమ్మీయము) పిండిప్రోలు లక్ష్మణకవికృతము, టీకాతాత్పర్యసహితము ... | 1 | 4 |
| వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము, అనేకనూతనాంశములుగల చక్కనిక్రొత్తకూర్పు ... | 4 | 0 |
| వసిష్ఠజనకసంవాదము, యామిజాల శేషయ్యకవి ... | 0 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ ... | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరనార్యప్రణీతము, లఘుటిప్పణీసహితము క్రొత్తకూర్పు ... | 2 | 8 |
| వివేకసింధువు, కొండనార్యప్రణీతము ... | 0 | 12 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవికృతము ... | 0 | 8 |
| విదురనీతి, టీకాతాత్పర్యసహితము, (ఆంధ్రభారతములోనిది) | 0 | 5 |
| వీరభద్రవిజయము, బమ్మెర పోతరాజకృతము ... | 0 | 12 |
| వేంకటాచలమాహాత్మ్యము, క్రొత్తకూర్పు, తరిగొండ వెంకమ్మ | 1 | 4 |
| వేంకటేశాంధ్రము ... | 0 | 6 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు ... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతర్జుమాతో ... | 1 | 4 |
| డిటో 2728 పద్యములు, కాలికోబైండు ... | 1 | 12 |
| డిటో తాత్పర్యసహితము, ఇందు గ్రంథవిమర్శ, కవిజీవితము మొదలగునవి చేర్పఁబడినవి, చక్కని క్రొత్తకూర్పు ... | 3 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 12 |
| శతకంఠరామాయణము, క్రొత్తకూర్పు, మర్దనకవికృతము ... | 0 | 10 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శతకసంపుటము (భక్తి) I (20 శతకములు) | ... | 2 | 0 |
| ,, II ,, | ... | 2 | 0 |
| ,, III ,, | ... | 2 | 0 |
| ,, (నీతి) I ,, | ... | 2 | 0 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | ... | 0 | 12 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవిప్రణీతము | ... | 0 | 6 |
| శృంగారనైషధము, శ్రీనాథకవి, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| శుకసప్తతి, కదిరీపతినాయకకృతము | ... | 0 | 6 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య | ... | 0 | 12 |
| సమీరకుమారవిజయము (నూతనముద్రితము) | ... | 1 | 4 |
| సప్తమస్కంధము, సాధారణప్రతి (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో సటీక, చిన్నసైజు | ... | 1 | 0 |
| సహస్రకంఠరామాయణము, రామావఝ్ఝల కొండయ్యకవి | ... | 0 | 12 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము | ... | 0 | 8 |
| సానందోపాఖ్యానము, శ్రీశివరామకవి విరచితము | ... | 1 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము, టీక వివరణములు మిక్కిలి విపులము. ఈవరకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది. సాధారణప్రతి | ... | 2 | 0 |
| డిటో మేలుకాగితములు, గిల్టుపేరు, కాలికోబైండు | ... | 3 | 8 |
| సులక్షణసారము, సటీక. | ... | 0 | 8 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, రామరాజభూషణప్రణీతము. సటీక, విపులమైన పీఠిక విమర్శనలతోనున్నది | ... | 2 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | ... | 0 | 12 |
| హరివంశము, క్రొత్తకూర్పు, ఎఱ్ఱాప్రెగడ | ... | 3 | 0 |
| డిటో మేలుకాగితములు | ... | 4 | 0 |